



లేదు అమృత: మ.2:57-4:45 దుర్ము: మ.12:24 - 1:08 మ.2:37 - 3:22బాలవ ఉ.8:25 కౌలవ రా.9:36 సుకర్మ రా.10:31, సూ.ఉ. 6.27, సూ.అ 5.37

**నవంబర్ 21** మంగళ మార్గశిర శు.తదియ రా.12:12 మూల తె.3:51 వర్జ్యం: ఉ.9:49 - 11:37 - 2:02 - 3:51 అమృత: రా.8:38 - 10:26 దుర్ము: ఉ.8:41 - 9:26 రా.9:49 - 10:39 తైతిల ఉ.10:54 గరజి రా.12:12 ధృతి రా.11:25, సూ.ఉ. 6.28, సూ.అ 5.35

**నవంబర్ 22** బుధ మార్గశిర శు.చవితి రా.2:55 పూ.షాఢ పూర్తి వర్జ్యం: మ.2:42-4:31 అమృత: రా.1:34 - 3:22 దుర్ము: ఉ.11:40 - 12:24 వణిజ మ.1:33 భద్రరా.2:55 శూల రా.12:25, సూ.ఉ. 6.28, సూ.అ 5.35

**నవంబర్ 23** గురు మార్గశిర శు.పంచమి తె.5:35 పూ.షాఢ ఉ.6:59 వర్జ్యం: సా.4:00-5:48 అమృత: రా.2:50 - 4:38 దుర్ము: ఉ.10:11 - 10:55 మ.2:38 - 3:22 బవ సా.4:15బాలవ తె.5:35 గండ రా.1:23, సూ.ఉ. 6.29, సూ.అ 5.35

**నవంబర్ 24** శుక్ర మార్గశిర శు.షష్ఠి పూర్తి రా. ఉ.షాఢ ఉ.10:03 వర్జ్యం: మ.2:31-4:18 అమృత: రా.1:13 - 3:0 దుర్ము: ఉ.8:43 - 9:27 మ.12:25 - 1:09 కౌలవ సా.6:46 వృద్ధి రా.2:10, సూ.ఉ. 6.29, సూ.అ 5.35

**నవంబర్ 25** శని మార్గశిర శు.షష్ఠి ఉ.7:58 శ్రవణం మ.12:49 వర్జ్యం: సా.5:12-6:57 అమృత: తె.3:42 - 5:27 దుర్ము: ఉ.6:30 - 7:14 తైతిల ఉ.7:58 గరజి రా.8:54 ధృవ రా.2:38, సూ.ఉ. 6.30, సూ.అ 5.35

**నవంబర్ 26** ఆది మార్గశిర శు.సప్తమి ఉ.9:51 ధనిష్ఠ మ.3:04 వర్జ్యం: రా.10:44 - 12:26 అమృత: లేదు దుర్ము: సా.4:07-4:51 వణిజ ఉ.9:51 భద్రరా.10:27 వ్యాఘాత రా.2:36, సూ.ఉ. 6.31, సూ.అ 5.35

**నవంబర్ 27** సోమ మార్గశిర శు.అష్టమి ఉ.11:03 శతభిషం సా.4:37 వర్జ్యం: రా.11:13 - 12:52 అమృత: ఉ.8:58 - 10:40 దుర్ము: మ.12:25 - 1:10 మ.2:38 - 3:23 బవ ఉ.11:03బాలవ రా.11:13 హర్షణ రా.1:58, సూ.ఉ. 6.31, సూ.అ 5.35

**నవంబర్ 28** మంగళ మార్గశిర శు.నవమి ఉ.11:24 పూ.భాద్ర సా.5:21 వర్జ్యం: రా.2:53 - 4:28 అమృత: ఉ.9:07 - 10:46 దుర్ము: ఉ.8:45 - 9:29 రా.9:51 - 10:41 కౌలవ ఉ.11:24 తైతిల రా.11:08 వజ్ర రా.12:39, సూ.ఉ. 6.32, సూ.అ 5.36

**నవంబర్ 29** బుధ మార్గశిర శు.దశమి ఉ.10:52 ఉ.భాద్ర సా.5:12 వర్జ్యం: రా.4:43 - 6:15 అమృత: మ.12:26 - 2:02 దుర్ము: ఉ.11:42 - 12:26 గరజి ఉ.10:52 వణిజ రా.10:09 సిద్ధి రా.10:37, సూ.ఉ. 6.32, సూ.అ 5.36

**నవంబర్ 30** గురు మార్గశిర శు.ఏకాదశి ఉ.9:26 రేవతి సా.4:13 వర్జ్యం: లేదు అమృత: మ.1:55 - 3:27 దుర్ము: ఉ.10:14 - 10:58 మ.2:39 - 3:23 భద్రఉ.9:26 బవ రా.8:19 వ్యతీపాత రా.7:55, సూ.ఉ. 6.33, సూ.అ 5.36




## డిసెంబర్ 2017

**డిసెంబర్ 1** శుక్ర మార్గశిర శు.ద్వాదశి ఉ.7:13 శు.త్రయోదశి తె.4:20 అశ్విని మ.2:28 వర్జ్యం: ఉ.10:46 - 12:15 - 11:08 - 12:35 అమృత: ఉ.7:48 - 9:17 దుర్ము: ఉ.8:46 - 9:30 మ.12:27 - 1:11బాలవ ఉ.7:13 కౌలవ సా.5:46 తైతిల తె.4:20 వరీయాన్ సా.4:38, సూ.ఉ. 6.34, సూ.అ 5.36

**డిసెంబర్ 2** శని మార్గశిర శు.చతుర్దశి రా.12:58 భరణి మ.12:07 వర్జ్యం: రా.10:45 - 12:09 అమృత: ఉ.7:48 - 9:14 దుర్ము: ఉ.6:34 - 7:18 గరజి మ.2:39 వణిజ రా.12:58 పరిఘ మ.12:52, సూ.ఉ. 6.34, సూ.అ 5.36

**డిసెంబర్ 3** ఆది మార్గశిర పౌర్ణమి రా.9:17 కృత్తిక ఉ.9:21 రోహిణి తె.6:21 వర్జ్యం: రా.11:21 - 12:45 అమృత: ఉ.7:14 - 8:39 - 3:34 - 4:58 దుర్ము: సా.4:08-4:52 భద్రఉ.11:07 బవ రా.9:17 శివ ఉ.8:46 సిద్ధ తె.4:28, సూ.ఉ. 6.35, సూ.అ 5.36

**డిసెంబర్ 4** సోమ మార్గశిర బ.పాడ్యమి సా.5:30 మృగశిర తె.3:20 వర్జ్యం: ఉ.11:15 - 12:39 అమృత: రా.7:38 - 9:02 దుర్ము: మ.12:28 - 1:12 మ.2:40 - 3:24బాలవ ఉ.7:23 కౌలవ సా.5:30 సాధ్య రా.12:07, సూ.ఉ. 6.35, సూ.అ 5.36

**డిసెంబర్ 5** మంగళ మార్గశిర బ.విదియ మ.1:47 ఆర్ద్ర రా.12:28 వర్జ్యం: ఉ.10:44 - 12:09 అమృత: మ.3:40-5:04 దుర్ము: ఉ.8:48 - 9:32 రా.9:53 - 10:43 గరజి మ.1:47 వణిజ రా.12:03 శుభ రా.7:54, సూ.ఉ. 6.36, సూ.అ 5.37

**డిసెంబర్ 6** బుధ మార్గశిర బ.తదియ ఉ.10:19 పునర్వసు రా.9:57 వర్జ్యం: ఉ.11:13 - 12:38 - 5:16 - 6:44 అమృత: రా.7:48 - 9:14 దుర్ము: ఉ.11:45 - 12:29 భద్రఉ.10:19 బవ రా.8:47 శుక్ల మ.3:55, సూ.ఉ. 6.37, సూ.అ 5.37





**డిసెంబర్ 7** గురు మార్గశిర బ.చవితి ఉ.7:16 బ.పంచమి తె.4:45 పుష్యమి రా.7:54 వర్జ్యం: ఉ.6:44 అమృత: మ.2:03 - 3:31 దుర్ము: ఉ.10:17 - 11:01 మ.2:41 - 3:25బాలవ ఉ.7:16 కౌలవ సా.6:00 తైతిల తె.4:45 బ్రహ్మ మ.12:18, , సూ.ఉ. 6.37, సూ.అ 5.37

**డిసెంబర్ 8** శుక్ర మార్గశిర బ.షష్ఠి రా.2:53 ఆశ్లేష సా.6:28 వర్జ్యం: ఉ.7:56 - 9:26 - 6:02 - 7:35 అమృత: సా.4:57-6:28 దుర్ము: ఉ.8:50 - 9:34 మ.12:30 - 1:14 గరజి మ.3:49 వణిజ రా.2:53 ఇంద్ర ఉ.9:09, సూ.ఉ. 6.38, సూ.అ 5.37

**డిసెంబర్ 9** శని మార్గశిర బ.సప్తమి రా.1:41 మఖ సా.5:41 వర్జ్యం: రా.1:39 - 3:16 అమృత: మ.3:21-4:54 దుర్ము: ఉ.6:38 - 7:22 భద్రమ.2:17 బవ రా.1:41 విష్కంభ తె.4:26, సూ.ఉ. 6.38, సూ.అ 5.38

**డిసెంబర్ 10** ఆది మార్గశిర బ.అష్టమి రా.1:12 పుబ్బ సా.5:35 వర్జ్యం: రా.12:57 - 2:36 అమృత: ఉ.11:13 - 12:49 దుర్ము: సా.4:10-4:54 బాలవ మ.1:26 కౌలవ రా.1:12 ప్రీతి రా.2:53, సూ.ఉ. 6.39, సూ.అ 5.38

**డిసెంబర్ 11** సోమ మార్గశిర బ.నవమి రా.1:22 ఉత్తర సా.6:09 వర్జ్యం: రా.2:57 - 4:38 అమృత: ఉ.10:47 - 12:25 దుర్ము: మ.12:31 - 1:15 మ.2:43 - 3:27 తైతిల మ.1:17 గరజి రా.1:22 ఆయుష్మాన్ రా.1:51, సూ.ఉ. 6.40, సూ.అ 5.38

**డిసెంబర్ 12** మంగళ మార్గశిర బ.దశమి రా.2:09 హస్త రా.7:18 వర్జ్యం: రా.3:51 - 5:34 అమృత: మ.1:01 - 2:42 దుర్ము: ఉ.8:52 - 9:36 రా.9:56 - 10:46 వణిజ మ.1:45 భద్రరా.2:09 సౌభాగ్య రా.1:17, సూ.ఉ. 6.40, సూ.అ 5.39

**డిసెంబర్ 13** బుధ మార్గశిర బ.ఏకాదశి తె.3:26 చిత్త రా.8:58 వర్జ్యం: రా.3:03 - 4:47 అమృత: మ.2:08 - 3:51 దుర్ము: ఉ.11:48 - 12:32 బవ మ.2:47బాలవ తె.3:26 శోభన రా.1:05, సూ.ఉ. 6.41, సూ.అ 5.39

**డిసెంబర్ 14** గురు మార్గశిర బ.ద్వాదశి తె.5:08 స్వాతి రా.11:04 వర్జ్యం: రా.5:14 - 7:00 అమృత: మ.1:30 - 3:15 దుర్ము: ఉ.10:21 - 11:05 మ.2:44 - 3:28 కౌలవ సా.4:17 తైతిల తె.5:08 అతిగండ రా.1:14, సూ.ఉ. 6.41, సూ.అ 5.39

**డిసెంబర్ 15** శుక్ర మార్గశిర బ.త్రయోదశి పూర్తి విశాఖ రా.1:30 వర్జ్యం: రా.5:57 - 7:44 అమృత: మ.3:49-5:35 దుర్ము: ఉ.8:53 - 9:37 మ.12:33 - 1:17 గరజి సా.6:09 సుకర్మ రా.1:37, సూ.ఉ. 6.42, సూ.అ 5.40

**డిసెంబర్ 16** శని మార్గశిర బ.త్రయోదశి ఉ.7:11 అనూరాధ తె.4:13 వర్జ్యం: లేదు అమృత: సా.4:38-6:25 దుర్ము: ఉ.6:42 - 7:26 వణిజ ఉ.7:11 భద్రరా.8:20 ధృతి రా.2:14, సూ.ఉ. 6.42, సూ.అ 5.40




**డిసెంబర్ 17** ఆది మార్గశిర బ.చతుర్దశి ఉ.9:30 జ్యేష్ఠ పూర్తి వర్జ్యం: ఉ.10:30 - 12:18 అమృత: రా.9:15 - 11:02 దుర్ము: సా.4:13-4:57 శకుని ఉ.9:30 చతుష్పాత్ రా.10:45 శూల తె.3:00, సూ.ఉ. 6.43, సూ.అ 5.41

**డిసెంబర్ 18** సోమ మార్గశిర అమావాస్య మ.12:00 జ్యేష్ఠ ఉ.7:07 వర్జ్యం: సా.4:08-5:56 అమృత: రా.2:57 - 4:45 దుర్ము: మ.12:34 - 1:18 మ.2:46 - 3:30 నాగ మ.12:00 కింతుఘ్న రా.1:19 గండ తె.3:53, సూ.ఉ. 6.43, సూ.అ 5.41

**డిసెంబర్ 19** మంగళ పుష్య శు.పాడ్యమి మ.2:39 మూల ఉ.10:09 వర్జ్యం: ఉ.8:21 - 10:09 - 8:59 - 10:47 అమృత: లేవు దుర్ము: ఉ.8:56 - 9:39 రా.9:59 - 10:50 బవ మ.2:39బాలవ తె.4:00 వృద్ధి తె.4:49, సూ.ఉ. 6.44, సూ.అ 5.42

**డిసెంబర్ 20** బుధ పుష్య శు.విదియ సా.5:21 పూ.షాఢ మ.1:15 వర్జ్యం: రా.10:16 - 12:04 అమృత: ఉ.7:50 - 9:39 దుర్ము: ఉ.11:51 - 12:35 కౌలవ సా.5:21 తైతిల తె.6:39 ధృవ తె.5:45, సూ.ఉ. 6.45, సూ.అ 5.42

**డిసెంబర్ 21** గురు పుష్య శు.తదియ రా.7:58 ఉ.షాఢ సా.4:18 వర్జ్యం: రా.8:47 - 10:35 అమృత: ఉ.9:06 - 10:54 దుర్ము: ఉ.10:24 - 11:08 మ.2:47 - 3:31 గరజి రా.7:58 వ్యాఘాత ఉ.6:36, సూ.ఉ. 6.45, సూ.అ 5.43

**డిసెంబర్ 22** శుక్ర పుష్య శు.చవితి రా.10:23 శ్రవణం రా.7:11 వర్జ్యం: రా.11:36 - 1:22 అమృత: ఉ.7:33 - 9:20 దుర్ము: ఉ.8:57 - 9:41 మ.12:36 - 1:20 వణిజ ఉ.9:10 భద్రరా.10:23 హర్షణ తె.7:14, సూ.ఉ. 6.46, సూ.అ 5.43

**డిసెంబర్ 23** శని పుష్య శు.పంచమి రా.12:25 ధనిష్ఠ రా.9:43 వర్జ్యం: రా.5:32 - 7:16 అమృత: ఉ.10:14 - 12:00 దుర్ము: ఉ.6:46 - 7:30 బవ ఉ.11:24బాలవ రా.12:25 హర్షణ ఉ.7:14, సూ.ఉ. 6.46, సూ.అ 5.44





**డిసెంబర్ 24** ఆది పుష్య శు.షష్ఠి రా.1:55 శతభిషం రా.11:46 వర్జ్యం: ఉ.7:16; తె.6:32 అమృత: మ.3:57-5:41 దుర్ము: సా.4:16-5:00 కౌలవ మ.1:10 తైతిల రా.1:55 వజ్ర ఉ.7:33, సూ.ఉ. 6.47, సూ.అ 5.44

**డిసెంబర్ 25** సోమ పుష్య శు.సప్తమి రా.2:44 పూ.భాద్ర రా.1:09 వర్జ్యం: ఉ.6:32 - 8:14 అమృత: సా.4:42-6:23 దుర్ము: మ.12:38 - 1:22 మ.2:49 - 3:33 గరజి మ.2:19 వణిజ రా.2:44 సిద్ధి ఉ.7:25, సూ.ఉ. 6.47, సూ.అ 5.45

**డిసెంబర్ 26** మంగళ పుష్య శు.అష్టమి రా.2:44 ఉ.భాద్ర రా.1:47 వర్జ్యం: ఉ.11:00 - 12:39 అమృత: రా.8:52 - 10:30 దుర్ము: ఉ.8:59 - 9:43 రా.10:02 - 10:53 భద్రము.2:44 బవ రా.2:44 వ్యతీపాత అ ఉ.6:45 వరీయాన్ తె.5:28, సూ.ఉ. 6.47, సూ.అ 5.45

**డిసెంబర్ 27** బుధ పుష్య శు.నవమి రా.1:55 రేవతి రా.1:37 వర్జ్యం: మ.1:42 - 3:17 అమృత: రా.11:14 - 12:49 దుర్ము: ఉ.11:55 - 12:39 బాలవ మ.2:19 కౌలవ రా.1:55 పరిఘ తె.3:31, సూ.ఉ. 6.48, సూ.అ 5.46

**డిసెంబర్ 28** గురు పుష్య శు.దశమి రా.12:17 అశ్విని రా.12:38 వర్జ్యం: రా.8:48 - 10:20 అమృత: సా.5:44 - 7:16 దుర్ము: ఉ.10:28 - 11:12 మ.2:51 - 3:35 తైతిల మ.1:06 గరజి రా.12:17 శివ రా.12:57, సూ.ఉ. 6.48, సూ.అ 5.46

**డిసెంబర్ 29** శుక్ర పుష్య శు.ఏకాదశి రా.9:55 భరణి రా.10:56 వర్జ్యం: ఉ.9:33 - 11:02 అమృత: సా.6:29 - 7:58 దుర్ము: ఉ.9:00 - 9:44 మ.12:40 - 1:24 వణిజ ఉ.11:06 భద్రరా.9:55 సిద్ధ రా.9:47, సూ.ఉ. 6.49, సూ.అ 5.47

**డిసెంబర్ 30** శని పుష్య శు.ద్వాదశి సా.6:55 కృత్తిక రా.8:38 వర్జ్యం: ఉ.9:45 - 11:12 అమృత: సా.6:28 - 7:55 దుర్ము: ఉ.6:49 - 7:33 బవ ఉ.8:25బాలవ సా.6:55 సాధ్య సా.6:07, సూ.ఉ. 6.49, సూ.అ 5.48

**డిసెంబర్ 31** ఆది పుష్య శు.త్రయోదశి మ.3:29 రోహిణి సా.5:54 వర్జ్యం: ఉ.10:49 - 12:14 - 10:48 - 12:12 అమృత: మ.3:04-4:29 దుర్ము: సా.4:20-5:04 తైతిల మ.3:29 గరజి రా.1:37 శుభ మ.2:04, సూ.ఉ. 6.49, సూ.అ 5.48

## జనవరి 2018

**జనవరి 1** సోమ పుష్య శు.చతుర్దశి ఉ.11:45 మృగశిర మ.2:53 వర్జ్యం: రా.10:12 - 11:36 అమృత: ఉ.7:12 - 8:36 - 3:5 - 4:29 దుర్ము: మ.12:41 - 1:25 మ.2:53 - 3:37 వణిజ ఉ.11:45 భద్రరా.9:49 శుక్ల ఉ.9:47, సూ.ఉ. 6.50, సూ.అ 5.49



**జనవరి 2** మంగళ పుష్య పౌర్ణమి ఉ.7:54 బ.పాడ్యమి తె.4:08 ఆర్ద్ర ఉ.11:47 వర్జ్యం: రా.10:18 - 11:42 అమృత: తె.6:42 - 8:6 దుర్ము: ఉ.9:02 - 9:46 రా.10:06 - 10:56 బవ ఉ.7:54బాలవ సా.6:01 ఇంద్ర రా.1:02, సూ.ఉ. 6.50, సూ.అ 5.49

**జనవరి 3** బుధ పుష్య బ.విదియ రా.12:38 పునర్వసు ఉ.8:49 పుష్యమి తె.6:07 వర్జ్యం: మ.3:55- .5:20 అమృత: మ. 12:26 - 1:52 దుర్ము: ఉ.11:58 - 12:42 తైతిల మ.2:23 గరజి రా.12:38 వైధృతి రా.8:52, సూ.ఉ. 6.50, సూ.అ 5.50

**జనవరి 4** గురు పుష్య బ.తదియ రా.9:32 ఆశ్లేష తె.3:54 వర్జ్యం: సా.5:44 - 7:11 అమృత: రా.2:26 - 3:54 దుర్ము: ఉ.10:31 - 11:15 మ.2:55 - 3:39 వణిజ ఉ.11:05 భద్రరా.9:32 విష్కుంభ సా.5:02, సూ.ఉ. 6.51, సూ.అ 5.50

**జనవరి 5** శుక్ర పుష్య బ.చవితి రా.7:00 మఖ రా.2:16 వర్జ్యం: మ.3:05-4:34 అమృత: రా.12:1 - 1:31 దుర్ము: ఉ.9:03 - 9:47 మ.12:43 - 1:27 బవ ఉ.8:16బాలవ రా.7:00 ప్రీతి మ.1:37, సూ.ఉ. 6.51, సూ.అ 5.51

**జనవరి 6** శని పుష్య బ.పంచమి సా.5:10 పుబ్బ రా.1:20 వర్జ్యం: ఉ.9:57 - 11:29 అమృత: రా.7:11 - 8:44 దుర్ము: ఉ.6:51 - 7:35 తైతిల సా.5:10 గరజి తె.4:37 ఆయుష్మాన్ ఉ.10:44, సూ.ఉ. 6.51, సూ.అ 5.52

**జనవరి 7** ఆది పుష్య బ.షష్ఠి సా.4:04 ఉత్తర రా.1:10 వర్జ్యం: ఉ.8:29 - 10:04 అమృత: సా.6:02 - 7:37 దుర్ము: సా.4:24-5:08 వణిజ సా.4:04 భద్రరా.3:55 సౌభాగ్య ఉ.8:27, సూ.ఉ. 6.52, సూ.అ 5.52

**జనవరి 8** సోమ పుష్య బ.సప్తమి మ.3:47 హస్త రా.1:46 వర్జ్యం: ఉ.9:47 - 11:25 అమృత: రా.7:37 - 9:15 దుర్ము: మ.12:44 - 1:29 మ.2:57 - 3:41 బవ మ.3:47బాలవ తె.4:01 అతిగండ తె.5:43, సూ.ఉ. 6.52, సూ.అ 5.53

**జనవరి 9** మంగళ పుష్య బ.అష్టమి సా.4:15 చిత్త తె.3:05 వర్జ్యం: ఉ.10:13 - 11:54 అమృత: రా.8:19 - 10:01 దుర్ము: ఉ.9:04 - 9:48 రా.10:09 - 11:00 కౌలవ సా.4:15 తైతిల తె.4:50 సుకర్మ తె.5:12, సూ.ఉ. 6.52, సూ.అ 5.54





**జనవరి 10** బుధ పుష్య బ.నవమి సా.5:26 స్వాతి తె.5:01 వర్జ్యం: ఉ.9:08 - 10:52 అమృత: రా.7:31 - 9:14 దుర్ము: మ.12:01 - 12:45 గరజి సా.5:26 వణిజ తె.6:18 ధృతి తె.5:11, సూ.ఉ. 6.52, సూ.అ 5.54

**జనవరి 11** గురు పుష్య బ.దశమి రా.7:11 విశాఖ తె.7:28 వర్జ్యం: ఉ.11:11 - 12:57 అమృత: రా.9:46 - 11:32 దుర్ము: ఉ.10:33 - 11:17 మ.2:58 - 3:42 భద్రరా.7:11 శూల తె.5:34, సూ.ఉ. 6.52, సూ.అ 5.55

**జనవరి 12** శుక్ర పుష్య బ.ఏకాదశి రా.9:23 విశాఖ ఉ.7:27 వర్జ్యం: ఉ.11:55 - 1:42 అమృత: రా.10:38 - 12:25 దుర్ము: ఉ.9:05 - 9:49 మ.12:46 - 1:30 బవ ఉ.8:17బాలవ రా.9:23 గండ ఉ.6:13, సూ.ఉ. 6.53, సూ.అ 5.55

**జనవరి 13** శని పుష్య బ.ద్వాదశి రా.11:52 అనూరాధ ఉ.10:14 వర్జ్యం: సా.4:33-6:20 అమృత: తె.3:21 - 5:9 దుర్ము: ఉ.6:53 - 7:37 కౌలవ ఉ.10:37 తైతిల రా.11:52 , సూ.ఉ. 6.53, సూ.అ 5.56

**జనవరి 14** ఆది పుష్య బ.త్రయోదశి రా.2:31 జ్యేష్ఠ మ.1:14 వర్జ్యం: రా.10:16 - 12:04 అమృత: లేదు దుర్ము: సా.4:28-5:12 గరజి మ.1:11 వణిజ రా.2:31 వృద్ధి ఉ.7:03, సూ.ఉ. 6.53, సూ.అ 5.57

**జనవరి 15** సోమ పుష్య బ.చతుర్దశి తె.5:12 మూల సా.4:19 వర్జ్యం: మ.2:31-4:19 - 3:08 తె.4:56 అమృత: ఉ.9:06 - 10:55 దుర్ము: మ.12:47 - 1:32 మ.3:00 - 3:44 భద్రమ.3:52 శకుని తె.5:12 ధృవ ఉ.7:59, సూ.ఉ. 6.53, సూ.అ 5.57

**జనవరి 16** మంగళ పుష్య అమావాస్య పూర్తి, పూ.షాఢ రా.7:22 వర్జ్యం: రా.4:21 - 6:09 అమృత: మ.1:58 - 3:46 దుర్ము: ఉ.9:06 - 9:50 రా.10:13 - 11:03 చతుష్పాత్ సా.6:29 నాగ తె.7:47 వ్యాఘాత ఉ.8:54, సూ.ఉ. 6.53, సూ.అ 5.58

**జనవరి 17** బుధ అమావాస్య ఉ.7:47 ఉ.షాఢ రా.10:18 వర్జ్యం: రా.2:45 - 4:32 అమృత: దుర్ము: నాగ ఉ.7:47 కింతుఘ్న రా.9:00 హర్షణ ఉ.9:46, సూ.ఉ. 6.53, సూ.అ 5.58

**జనవరి 18** గురు మాఘ శు.పాడ్యమి ఉ.10:13 శ్రవణం రా.1:02 వర్జ్యం: రా.5:26 - 7:12 అమృత: మ.1:27 - 3:14 దుర్ము: ఉ.10:35 - 11:20 మ.3:02 - 3:46 బవ ఉ.10:13బాలవ రా.11:17 వజ్ర ఉ.10:30, సూ.ఉ. 6.53, సూ.అ 6.00

**జనవరి 19** శుక్ర మాఘశు.విదియ మ.12:22 ధనిష్ఠ తె.3:28 వర్జ్యం: ఉ.7:12 అమృత: సా.4:01-5:47 దుర్ము: ఉ.9:07 - 9:51 మ.12:49 - 1:33 కౌలవ మ.12:22 తైతిల రా.1:16 సిద్ధి ఉ.11:02, సూ.ఉ. 6.53, సూ.అ 6.00

**జనవరి 20** శని మాఘ శు.తదియ మ.2:11 శతభిషం తె.5:31 వర్జ్యం: ఉ.11:17 - 1:01 అమృత: రా.9:43 - 11:27 దుర్ము: ఉ.6:53 - 7:38 గరజి మ.2:11 వణిజ రా.2:52 వ్యతీపాత ఉ.11:19, సూ.ఉ. 6.53, సూ.అ 6.00

**జనవరి 21** ఆది మాఘ శు.చవితి మ.3:34 పూ.భాద్ర పూర్తి వర్జ్యం: మ.12:20 - 2:02 అమృత: రా.10:35 - 12:17 దుర్ము: సా.4:32-5:16 భద్రమ.3:34 బవ తె.3:59 వరీయాన్ ఉ.11:16, సూ.ఉ. 6.53, సూ.అ 6.01

**జనవరి 22** సోమ మాఘ శు.పంచమి సా.4:25 పూ.భాద్ర ఉ.7:06 వర్జ్యం: సా.5:06-6:47 అమృత: తె.3:8 - 4:48 దుర్ము: మ.12:50 - 1:34 మ.3:03 - 3:48బాలవ సా.4:25 కౌలవ తె.4:32 పరిఘ ఉ.10:51, సూ.ఉ. 6.53, సూ.అ 6.02

**జనవరి 23** మంగళ మాఘ శు.షష్ఠి సా.4:40 ఉ.భాద్ర ఉ.8:08 వర్జ్యం: రా.8:21 - 9:59 అమృత: తె.6:8 - 7:46 దుర్ము: ఉ.9:07 - 9:51 రా.10:15 - 11:05 తైతిల సా.4:40 గరజి తె.4:28 శివ ఉ.9:59, సూ.ఉ. 6.53, సూ.అ 6.02

**జనవరి 24** బుధ మాఘ శు.సప్తమి సా.4:17 రేవతి ఉ.8:34 వర్జ్యం: రా.4:23 - 5:58 అమృత: లేదు - 1:13 - 2:49 దుర్ము: మ.12:06 - 12:50 వణిజ సా.4:17 భద్రరా.3:45 సిద్ధ ఉ.8:38, సూ.ఉ. 6.53, సూ.అ 6.03

**జనవరి 25** గురు మాఘ శు.అష్టమి మ.3:14 అశ్విని ఉ.8:21 వర్జ్యం: సా.5:36 - 7:09 అమృత: రా.2:53 - 4:25 దుర్ము: ఉ.10:36 - 11:21 మ.3:05 - 3:49 బవ మ.3:14బాలవ రా.2:2333 సాధ్య ఉ.6:46 శుభ తె.4:23, సూ.ఉ. 6.53, సూ.అ 6.03

**జనవరి 26** శుక్ర మాఘ శు.నవమి మ.1:32 భరణి ఉ.7:30, కృత్తిక తె. 5.48, వర్జ్యం: సా.6:46 - 8:16 అమృత: తె.3:48 - 5:18 దుర్ము: ఉ.9:07 - 9:52 మ.12:51 - 1:35 కౌలవ మ.1:32 తైతిల రా.12:23 శుక్ల రా.1:30, సూ.ఉ. 6.53, సూ.అ 6.04

**జనవరి 27** శని మాఘ శు.దశమి ఉ.11:15 రోహిణి తె.4:05 వర్జ్యం: రా.8:44 - 10:12 అమృత: రా.1:8 - 2:36 దుర్ము: ఉ.6:53 - 7:37 గరజి ఉ.11:15 వణిజ రా.9:51 బ్రహ్మ రా.10:12, సూ.ఉ. 6.53, సూ.అ 6.05

**జనవరి 28** ఆది మాఘ శు.ఏకాదశి ఉ.8:28 శు.ద్వాదశి తె.5:18 మృగశిర రా.1:42 వర్జ్యం: ఉ.9:08 - 10:34 అమృత: సా.5:47 - 7:13 దుర్ము: సా.4:35-5:20 భద్రఉ.8:28 బవ సా.6:53 ఇంద్ర సా.6:32, సూ.ఉ. 6.52,





సూ.అ 6.05

**జనవరి 29** సోమ మాఘ శు.త్రయోదశి రా.1:53 ఆర్ద్ర రా.11:04 వర్జ్యం: ఉ.9:11 - 10:36 అమృత: మ.2:10 - 3:35 దుర్ము: మ.12:51 - 1:36 మ.3:06 - 3:51 కౌలవ మ.3:35 తైతిల రా.1:53 వైధృతి మ.2:36, సూ.ఉ. 6.52, సూ.అ 6.06

**జనవరి 30** మంగళ మాఘ శు.చతుర్దశి రా.10:23 పునర్వసు రా.8:18 వర్జ్యం: ఉ.9:41 - 11:06 - 3:24 - 4:49 అమృత: సా.6:11 - 7:36 దుర్ము: ఉ.9:07 - 9:52 రా.10:18 - 11:07 గరజి మ.12:08 వణిజ రా.10:23 విష్కుంభ ఉ.10:31, సూ.ఉ. 6.52, సూ.అ 6.06

**జనవరి 31** బుధ మాఘ పౌర్ణమి సా.6:57 పుష్యమి సా.5:36 వర్జ్యం: రా.5:04 - 6:30 అమృత: ఉ.11:55 - 1:20 దుర్ము: మ.12:07 - 12:52 భద్రఉ.8:40 బవ సా.6:57 ఆయుష్మాన్ రా.2:26, సూ.ఉ. 6.52, సూ.అ 6.07

## ఫిబ్రవరి 2018

**ఫిబ్రవరి 1** గురు మాఘ బ.పాడ్యమి మ.3:44 ఆశ్లేష మ.3:06 వర్జ్యం: రా.2:03 - 3:31 అమృత: మ.1:40 - 3:07 దుర్ము: ఉ.10:37 - 11:22 మ.3:07 - 3:52 కౌలవ మ.3:44 తైతిల రా.2:19 సౌభాగ్య రా.10:41, సూ.ఉ. 6.52, సూ.అ 6.07

**ఫిబ్రవరి 2** శుక్ర మాఘ బ.విదియ మ.12:54 మఖ మ.12:59 వర్జ్యం: రా.8:27 - 9:57 అమృత: ఉ.10:48 - 12:16 - 5:26 - 6:56 దుర్ము: ఉ.9:07 - 9:52 మ.12:52 - 1:37 గరజి మ.12:54 వణిజ రా.11:45 శోభన రా.7:17, సూ.ఉ. 6.51, సూ.అ 6.08

**ఫిబ్రవరి 3** శని మాఘ బ.తదియ ఉ.10:36 పుబ్బ ఉ.11:24 వర్జ్యం: సా.6:19 - 7:51 అమృత: తె.3:33 - 5:6 దుర్ము: ఉ.6:51 - 7:36 భద్రఉ.10:36 బవ రా.9:47 అతిగండ సా.4:20, సూ.ఉ. 6.51, సూ.అ 6.08

**ఫిబ్రవరి 4** ఆది మాఘ బ.చవితి ఉ.8:58 ఉత్తర ఉ.10:28 వర్జ్యం: సా.6:48 - 8:23 అమృత: తె.4:20 - 5:56 దుర్ము: సా.4:38-5:24 బాలవ ఉ.8:58 కౌలవ రా.8:31 సుకర్మ మ.1:57, సూ.ఉ. 6.51, సూ.అ 6.08

**ఫిబ్రవరి 5** సోమ మాఘ బ.పంచమి ఉ.8:05 హస్త ఉ.10:17 వర్జ్యం: సా.6:29 - 8:07 అమృత: తె.4:20 - 5:58 దుర్ము: మ.12:52 - 1:38 మ.3:08 - 3:53 తైతిల ఉ.8:05 గరజి రా.8:03 ధృతి మ.12:10, సూ.ఉ. 6.50, సూ.అ 6.09




**ఫిబ్రవరి 6** మంగళ మాఘ బ.షష్ఠి ఉ.8:01 చిత్త ఉ.10:53 వర్జ్యం: సా.4:48-6:30 అమృత: రా.2:58 - 4:40 దుర్ము: ఉ.9:06 - 9:51 రా.10:19 - 11:08 వణిజ ఉ.8:01 భద్రరా.8:23 శూల ఉ.11:02, సూ.ఉ. 6.50, సూ.అ 6.10

**ఫిబ్రవరి 7** బుధ మాఘ బ.సప్తమి ఉ.8:45 స్వాతి మ.12:16 వర్జ్యం: సా.6:21 - 8:05 అమృత: తె.4:46 - 6:31 దుర్ము: మ.12:07 - 12:53 బవ ఉ.8:45బాలవ రా.9:29 గండ ఉ.10:30, సూ.ఉ. 6.50, సూ.అ 6.10

**ఫిబ్రవరి 8** గురు మాఘ బ.అష్టమి ఉ.10:13 విశాఖ మ.2:19 వర్జ్యం: సా.6:45 - 8:31 అమృత: తె.5:24 - 7:10 దుర్ము: ఉ.10:36 - 11:22 మ.3:09 - 3:54 కౌలవ ఉ.10:13 తైతిల రా.11:14 వృద్ధి ఉ.10:31, సూ.ఉ. 6.49, సూ.అ 6.11

**ఫిబ్రవరి 9** శుక్ర మాఘ బ.నవమి మ.12:16 అనూరాధ సా.4:55 వర్జ్యం: రా.11:13 - 1:01 అమృత: లేదు దుర్ము: ఉ.9:05 - 9:51 మ.12:53 - 1:38 గరజి మ.12:16 వణిజ రా.1:30 ధృవ ఉ.10:58, సూ.ఉ. 6.49, సూ.అ 6.11

**ఫిబ్రవరి 10** శని మాఘ బ.దశమి మ.2:44 జ్యేష్ఠ రా.7:53 వర్జ్యం: రా.4:55 - 6:43 అమృత: ఉ.10:00 - 11:47 దుర్ము: ఉ.6:49 - 7:34 భద్రమ.2:44 బవ తె.4:04 వ్యాఘాత ఉ.11:45, సూ.ఉ. 6.49, సూ.అ 6.12

**ఫిబ్రవరి 11** ఆది మాఘ బ.ఏకాదశి సా.5:25 మూల రా.10:59 వర్జ్యం: రా.9:11 - 10:59 అమృత: మ.3:46-5:34 దుర్ము: సా.4:41-5:26 బాలవ సా.5:25 కౌలవ తె.6:46 హర్షణ మ.12:41, సూ.ఉ. 6.48, సూ.అ 6.12

**ఫిబ్రవరి 12** సోమ మాఘ బ.ద్వాదశి రా.8:05 పూ.షాఢ రా.2:04 వర్జ్యం: ఉ.9:49 - 11:37 అమృత: రా.8:39 - 10:27 దుర్ము: మ.12:53 - 1:39 మ.3:10 - 3:56 తైతిల రా.8:05 వజ్ర మ.1:40, సూ.ఉ. 6.48, సూ.అ 6.13

**ఫిబ్రవరి 13** మంగళ మాఘ బ.త్రయోదశి రా.10:35 ఉ.షాఢ తె.4:57 వర్జ్యం: ఉ.11:02 - 12:50 అమృత: రా.9:46 - 11:34 దుర్ము: ఉ.9:04 - 9:50 రా.10:20 - 11:09 గరజి ఉ.9:20 వణిజ రా.10:35 సిద్ధి మ.2:32, సూ.ఉ. 6.47, సూ.అ 6.13

**ఫిబ్రవరి 14** బుధ మాఘ బ.చతుర్దశి రా.12:47 శ్రవణం తె.8:32 వర్జ్యం: ఉ.9:23 - 11:09 అమృత: రా.8:00 - 9:47 దుర్ము: మ.12:07 - 12:53 భద్రఉ.11:41 శకుని రా.12:47 వ్యతీపాత మ.3:13, సూ.ఉ. 6.47,





సూ.అ 6.13

**ఫిబ్రవరి 15** గురు మాఘ అమావాస్య రా.2:35 శ్రవణం ఉ.7:31 వర్జ్యం: ఉ.11:53 - 1:38 అమృత: రా.10:22 - 12:6 దుర్ము: ఉ.10:35 - 11:21 మ.3:10 - 3:56 చతుష్పాత్ మ.1:41 నాగ రా.2:35 వరీయాన్ మ.3:37, సూ.ఉ. 6.46, సూ.అ 6.14

**ఫిబ్రవరి 16** శుక్ర ఫాల్గుణ శు.పాడ్యమి తె.3:57 ధనిష్ఠ ఉ.9:42 వర్జ్యం: సా.5:26 - 7:09 అమృత: తె.3:44 - 5:27 దుర్ము: ఉ.9:03 - 9:49 మ.12:53 - 1:39, బవ తె.3:57 పరిఘ మ.3:43, సూ.ఉ. 6.46, సూ.అ 6.14

**ఫిబ్రవరి 17** శని ఫాల్గుణ శు.విదియ తె.4:51 శతభిషం ఉ.11:28 వర్జ్యం: సా.6:13 - 7:54 అమృత: తె.4:20 - 6:1 దుర్ము: ఉ.6:45 - 7:31 బాలవ సా.4:24 కౌలవ తె.4:51 శివ మ.3:28, సూ.ఉ. 6.45, సూ.అ 6.15

**ఫిబ్రవరి 18** ఆది ఫాల్గుణ శు.తదియ తె.5:17 పూ.భాద్ర మ.12:46 వర్జ్యం: రా.10:42 - 12:24 అమృత: లేదు దుర్ము: సా.4:43-5:29 తైతిల సా.5:04 గరజి తె.5:17 సిద్ధ మ.2:51, సూ.ఉ. 6.45, సూ.అ 6.15

**ఫిబ్రవరి 19** సోమ ఫాల్గుణ శు.చవితి తె.5:15 ఉ.భాద్ర మ.1:38 వర్జ్యం: రా.1:51 - 3:29 అమృత: ఉ.8:40 - 10:20 దుర్ము: మ.12:53 - 1:39 మ.3:11 - 3:57 వణిజ సా.5:16 భద్రరా.5:15 సాధ్య మ.1:53, సూ.ఉ. 6.44, సూ.అ 6.15

**ఫిబ్రవరి 20** మంగళ ఫాల్గుణ శు.పంచమి తె.4:46 రేవతి మ.2:03 వర్జ్యం: లేదు అమృత: ఉ.11:36 - 1:14 దుర్ము: ఉ.9:02 - 9:48 రా.10:21 - 11:09 బవ సా.5:00బాలవ తె.4:46 శుభ మ.12:34, సూ.ఉ. 6.44, సూ.అ 6.16

**ఫిబ్రవరి 21** బుధ ఫాల్గుణ శు.షష్ఠి తె.3:50 అశ్విని మ.2:01 వర్జ్యం: ఉ.10:01 - 11:37 - 11:26 - 1:00 అమృత: ఉ.6:50 - 8:26 దుర్ము: మ.12:06 - 12:53 కౌలవ సా.4:18 తైతిల తె.3:50 శుక్ల ఉ.10:54, సూ.ఉ. 6.43, సూ.అ 6.16

**ఫిబ్రవరి 22** గురు ఫాల్గుణ శు.సప్తమి రా.2:29 భరణి మ.1:34 వర్జ్యం: రా.1:08 - 2:41 అమృత: ఉ.8:52 - 10:26 దుర్ము: ఉ.10:34 - 11:20 మ.3:11 - 3:58 గరజి మ.3:09 వణిజ రా.2:29 బ్రహ్మ ఉ.8:53, సూ.ఉ. 6.42, సూ.అ 6.16

**ఫిబ్రవరి 23** శుక్ర ఫాల్గుణ శు.అష్టమి రా.12:44 కృత్తిక మ.12:43 వర్జ్యం: రా.3:53 - 5:24 అమృత: ఉ.10:24 - 11:56 దుర్ము: ఉ.9:01 - 9:47 మ.12:52 - 1:39 భద్రమ.1:36 బవ రా.12:44 ఇంద్ర ఉ.6:32 వైధృతి తె.3:52, సూ.ఉ. 6.42, సూ.అ 6.17

**ఫిబ్రవరి 24** శని ఫాల్గుణ శు.నవమి రా.10:36 రోహిణి ఉ.11:28 వర్జ్యం: సా.4:42-6:12 అమృత: ఉ.8:26 - 9:57 - 1:40 - 3:10 దుర్ము: ఉ.6:41 - 7:28 బాలవ ఉ.11:40 కౌలవ రా.10:36 విష్కుంభ రా.12:55, సూ.ఉ. 6.41, సూ.అ 6.17

**ఫిబ్రవరి 25** ఆది ఫాల్గుణ శు.దశమి రా.8:10 మృగశిర ఉ.9:54 వర్జ్యం: సా.5:39 - 7:08 అమృత: రా.10:49 - 12:17 దుర్ము: సా.4:44-5:31 తైతిల ఉ.9:23 గరజి రా.8:10 ప్రీతి రా.9:43, సూ.ఉ. 6.41, సూ.అ 6.17

**ఫిబ్రవరి 26** సోమ ఫాల్గుణ శు.ఏకాదశి సా.5:29 ఆర్ద్ర ఉ.8:03 పునర్వసు తె.5:10 వర్జ్యం: సా.6:36 - 8:00 అమృత: తె.3:48 - 5:16రారా దుర్ము: మ.12:52 - 1:39 మ.3:12 - 3:58 వణిజ ఉ.6:49 భద్రసా.5:29 ఆయుష్మాన్ సా.6:20, సూ.ఉ. 6.40, సూ.అ 6.18

**ఫిబ్రవరి 27** మంగళ ఫాల్గుణ శు.ద్వాదశి మ.2:39 పుష్యమి తె.3:51 వర్జ్యం: మ.12:44 - 2:15 అమృత: రా.10:02 - 11:29రారా దుర్ము: ఉ.8:59 - 9:46 రా.10:21 - 11:09బాలవ మ.2:39 కౌలవ రా.1:12 సౌభాగ్య మ.2:49, సూ.ఉ. 6.39, సూ.అ 6.18

**ఫిబ్రవరి 28** బుధ ఫాల్గుణ శు.త్రయోదశి ఉ.11:46 ఆశ్లేష రా.1:45 వర్జ్యం: మ.3:32-5:00 అమృత: రా.12:17 - 1:45 దుర్ము: మ.12:05 - 12:52 తైతిల ఉ.11:46 గరజి రా.10:22 శోభన ఉ.11:17, సూ.ఉ. 6.39, సూ.అ 6.18

## మార్చి 2018

**మార్చి 1** గురు ఫాల్గుణ శు.చతుర్దశి ఉ.8:58 మఖ రా.11:47 వర్జ్యం: మ.12:46 - 2:14 అమృత: రా.9:35 - 11:03 దుర్ము: ఉ.10:31 - 11:18 మ.3:12 - 3:58 వణిజ ఉ.8:58 భద్రరా.7:39 అతిగండ ఉ.7:47 సుకర్మ తె.4:27, సూ.ఉ. 6.38, సూ.అ 6.19

**మార్చి 2** శుక్ర ఫాల్గుణ పౌర్ణమి ఉ.6:21 బ.పాడ్యమి తె.4:06 పుబ్బ రా.10:08 వర్జ్యం: ఉ.7:14 - 8:43 - 4:58 - 6:29 అమృత: సా.4:11-5:40 దుర్ము: ఉ.8:58 - 9:44 మ.12:51 - 1:38 బవ ఉ.6:21బాలవ సా.5:13 కౌలవ తె.4:06 ధృతి రా.1:24, సూ.ఉ. 6.37, సూ.అ 6.19

**మార్చి 3** శని ఫాల్గుణ బ.విదియ రా.2:21 ఉత్తర రా.8:55 వర్జ్యం: రా.5:05 - 6:38 అమృత: మ.2:05 - 3:37



దుర్ము: ఉ.6:37 - 7:23 తైతిల మ.3:12 గరజి రా.2:19 శూల రా.10:43, సూ.ఉ. 6.37, సూ.అ 6.19

**మార్చి 4** ఆది ఫాల్గుణ బ.తదియ రా.1:08 హస్త రా.8:16 వర్జ్యం: రా.4:17 - 5:53 అమృత: మ.2:26-4:00 దుర్ము: సా.4:46-5:33 వణిజ మ.1:43 భద్రరా.1:08 గండ రా.8:30, సూ.ఉ. 6.36, సూ.అ 6.19

**మార్చి 5** సోమ ఫాల్గుణ బ.చవితి రా.12:40 చిత్త రా.8:18 వర్జ్యం: రా.2:05 - 3:44 అమృత: మ.1:54 - 3:30 దుర్ము: మ.12:51 - 1:38 మ.3:12 - 3:59 బవ మ.12:54బాలవ రా.12:40 వృద్ధి సా.6:50, సూ.ఉ. 6.35, సూ.అ 6.20

**మార్చి 6** మంగళ ఫాల్గుణ బ.పంచమి రా.12:58 స్వాతి రా.9:04 వర్జ్యం: రా.3:01 - 4:43 అమృత: మ.12:00 - 1:39 దుర్ము: ఉ.8:56 - 9:43 రా.10:21 - 11:08 కౌలవ మ.12:49 తైతిల రా.12:58 ధృవ సా.5:45, సూ.ఉ. 6.34, సూ.అ 6.20

**మార్చి 7** బుధ ఫాల్గుణ బ.షష్ఠి రా.2:01 విశాఖ రా.10:34 వర్జ్యం: రా.2:56 - 4:41 అమృత: మ.1:14 - 2:56 దుర్ము: మ.12:03 - 12:50 గరజి మ.1:29 వణిజ రా.2:01 వ్యాఘాత సా.5:16, సూ.ఉ. 6.34, సూ.అ 6.20

**మార్చి 8** గురు ఫాల్గుణ బ.సప్తమి తె.3:45 అనూరాధ రా.12:45 వర్జ్యం: లేదు అమృత: మ.1:25 - 3:09 దుర్ము: ఉ.10:29 - 11:16 మ.3:12 - 3:59 భద్రమ.2:53 బవ తె.3:45 హర్షణ సా.5:20, సూ.ఉ. 6.33, సూ.అ 6.20

**మార్చి 9** శుక్ర ఫాల్గుణ బ.అష్టమి తె.6:01 జ్యేష్ఠ తె.3:27 వర్జ్యం: ఉ.6:59 - 8:46 అమృత: సా.5:40 - 7:27 దుర్ము: ఉ.8:54 - 9:41 మ.12:50-1:37బాలవ సా.4:53 కౌలవ ఉ.6:01 వజ్ర సా.5:51, సూ.ఉ. 6.32, సూ.అ 6.21

**మార్చి 10** శని ఫాల్గుణ బ.నవమి పూర్తి రా. మూల తె.6:28 వర్జ్యం: మ.12:27 - 2:15 - 4:40 - 6:28 అమృత: రా.11:16 - 1:4 దుర్ము: ఉ.6:31 - 7:19 తైతిల రా.7:18 సిద్ధి సా.6:42, సూ.ఉ. 6.31, సూ.అ 6.21

**మార్చి 11** ఆది ఫాల్గుణ బ.నవమి ఉ.8:36 పూ.షాఢ పూర్తి వర్జ్యం: సా.5:18 - 7:06 అమృత: తె.4:9 - 5:58 దుర్ము: సా.4:46-5:34 గరజి ఉ.8:36 వణిజ రా.9:55 వ్యతీపాత రా.7:41, సూ.ఉ. 6.31, సూ.అ 6.21

**మార్చి 12** సోమ ఫాల్గుణ బ.దశమి ఉ.11:14 పూ.షాఢ ఉ.9:34 వర్జ్యం: సా.6:33 - 8:21 అమృత: తె.5:20 - 7:8 దుర్ము: మ.12:49 - 1:37 మ.3:12 - 3:59 భద్రఉ.11:14 బవ రా.12:27 వరీయాన్ రా.8:38, సూ.ఉ. 6.30, సూ.అ 6.21

**మార్చి 13** మంగళ ఫాల్గుణ బ.ఏకాదశి మ.1:41 ఉ.షాఢ మ.12:31 వర్జ్యం: సా.4:57-6:43 అమృత: తె.3:35 - 5:22 దుర్ము: ఉ.8:52 - 9:39 రా.10:20 - 11:07బాలవ మ.1:41 కౌలవ రా.2:43 పరిఘ రా.9:23, సూ.ఉ. 6.29, సూ.అ 6.22

**మార్చి 14** బుధ ఫాల్గుణ బ.ద్వాదశి మ.3:46 శ్రవణం మ.3:06 వర్జ్యం: రా.7:27 - 9:11 అమృత: తె.5:54 - 7:38 దుర్ము: మ.12:01 - 12:49 తైతిల మ.3:46 గరజి తె.4:33 శివ రా.9:50, సూ.ఉ. 6.28, సూ.అ 6.22

**మార్చి 15** గురు ఫాల్గుణ బ.త్రయోదశి సా.5:20 ధనిష్ఠ సా.5:12 వర్జ్యం: రా.12:52 - 2:34 అమృత: లేదు దుర్ము: ఉ.10:26 - 11:13 మ.3:12 - 3:59 వణిజ సా.5:20 భద్రరా.5:49 సిద్ధ రా.9:52, సూ.ఉ. 6.28, సూ.అ 6.22

**మార్చి 16** శుక్ర ఫాల్గుణ బ.చతుర్దశి సా.6:18 శతభిషం సా.6:45 వర్జ్యం: రా.1:24 - 3:04 అమృత: ఉ.11:05 - 12:47 దుర్ము: ఉ.8:50 - 9:38 మ.12:48 - 1:36 శకుని సా.6:18 సాధ్య రా.9:27, సూ.ఉ. 6.27, సూ.అ 6.22

**మార్చి 17** శని ఫాల్గుణ అమావాస్య సా.6:42 పూ.భాద్ర రా.7:43 వర్జ్యం: రా.5:30 - 7:08 అమృత: ఉ.11:24 - 1:04 దుర్ము: ఉ.6:26 - 7:14 చతుష్పాత్ ఉ.6:30 నాగ సా.6:42 శుభ రా.8:36, సూ.ఉ. 6.26, సూ.అ 6.23



## అష్టమ చంద్రుడు

**జన్మరాశి నక్షత్రాల వారికి అష్టమ రాశి - నక్షత్రాలలో చంద్ర సంచారదినాలు అనుకూలించవు. కేలండరులో ప్రతిదినం ఏ నక్షత్రంలో చంద్ర సంచారం జరుగుతుందో సూచించబడింది. ఈ కింది పట్టికలో ఏ జన్మరాశి, నక్షత్రాల వారికి ఏ అష్టమరాశి - నక్షత్రాలు ప్రతికూలమో సూచించడం జరిగింది.**

| మీ జన్మరాశి | మీ జన్మ నక్షత్రం | మీ అష్టమరాశి నక్షత్రాలు |
|---|---|---|
| మేషం | అశ్విని, భరణి, కృత్తిక-1 | విశాఖ-4, అనూరాధ, జ్యేష్ఠ |
| వృషభం | కృత్తిక- 2,3,4, రోహిణి, మృగశిర - 1, 2 | మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ-1 |
| మిథునం | మృగశిర - 3, 4 ఆర్ద్ర పునర్వసు 1, 2, 3 | ఉత్తరాషాఢ 2,3,4, శ్రవణం, ధనిష్ఠ - 1, 2 |
| కర్కాటకం | పునర్వసు-4, పుష్యమి, ఆశ్లేష | ధనిష్ఠ-3,4, శతభిషం పూర్వాభాద్ర - 1,2,3 |
| సింహం | మఖ, పుబ్బ, ఉత్తర-1 | పూర్వాభాద్ర-4, ఉత్తరాభాద్ర, రేవతి |
| కన్య | ఉత్తర-2,3,4, హస్త, చిత్త-1,2 | అశ్విని, భరణి, కృత్తిక-1 |
| తుల | చిత్త-3,4, స్వాతి, కృత్తిక-2,3,4, | రోహిణి, మృగశిర-1,2 |
| వృశ్చికం | విశాఖ-4, అనూరాధ, జ్యేష్ఠ | మృగశిర-3,4 ఆరుద్ర పునర్వసు - 1,2,3 |
| ధనుస్సు | మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ-1 | పునర్వసు-4, పుష్యమి, ఆశ్లేష |
| మకరం | ఉత్తరాషాఢ-2,3,4, శ్రవణం, ధనిష్ఠ-1,2 | మఖ, పుబ్బ, ఉత్తర-1 |
| కుంభం | ధనిష్ఠ - 3,4, శతభిషం పూర్వాభాద్ర-1,2,3 | ఉత్తర-2,3,4, హస్త, చిత్త-1,2 |
| మీనం | పూర్వాభాద్ర-4 ఉత్తరాభాద్ర, రేవతి | చిత్త-3,4, స్వాతి, విశాఖ 1,2,3 |

## పంచాంగ సమయాల్లో తేడాలు

శుభాశుభాలకు పంచాంగం చూడడం మన సంప్రదాయం. అయితే ఒక పంచాంగానికి, మరో పంచాంగానికి పొంతన ఉండదు. తిథి, నక్షత్రాల సమయాల్లో కొన్ని సందర్భాల్లో గంటల వ్యత్యాసం ఉంటుంది. ఏ పంచాంగం లేదా క్యాలెండర్ ప్రామాణికమైనది అనే సందేహం ప్రతి ఒక్కరిలోనూ కలుగుతుంది. ఈ అయోమయం నుంచి ప్రజలను బయటపడవేసేందుకు కోల్‌కత్తాలో కేంద్ర ప్రభుత్వ ఆధ్వర్యంలో నడిచే పొజిషనల్ ఆస్ట్రానమీ సెంటర్ ఏటా రాష్ట్రీయ పంచాంగం పేరిట సశాస్త్రీయ పంచాంగాన్ని రూపొందిస్తోంది. స్థానిక కాలమానానికి అనుగుణంగా దేశం మొత్తానికి వర్తించే ఈ పంచాంగం 16 భాషల్లోకి అనువదిస్తున్నారు. తిథి, నక్షత్రాల సమయాలు, పండుగల విషయాల్లో ఈ పంచాంగాన్నే ప్రామాణికంగా తీసుకోవడం సముచితం. ఆంధ్రజ్యోతి క్యాలెండర్‌లో ఇస్తున్న తిథి, నక్షత్రాది సమయాలు ప్రామాణిక రాష్ట్రీయ పంచాంగ సూత్రాలకు అనుగుణంగా గుణించినవి. గమనించగలరు.





# శ్రీ హేవళంబి నామ సంవత్సర రాశిఫలాలు (నక్షత్రాల ఆధారంగా)



**మేషం (అశ్విని, భరణి, కృత్తిక 1 పాదం)**

శ్రీ హేవళంబినామ సంవత్సరంలో మేష రాశి వారు వృత్తి వ్యాపారాల్లో అభివృద్ధి సాధిస్తారు. పెద్దలు, ప్రముఖులతో పరిచయాలు ఏర్పడతాయి. వివాహ ప్రయత్నాలు ఫలిస్తాయి. శతృవులపై విజయం సాధిస్తారు. ఆరోగ్యం మెరుగుపడుతుంది. స్టాక్ మార్కెట్ లావాదేవీలు అనుకూలిస్తాయి. ఆస్తులు పెంపొందించుకుంటారు. గురువు వక్రగమనంలో ఉన్న ఏప్రిల్ - జూన్ మాసాల మధ్య ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. పట్టుదలతో కృషి చేసినప్పుడే ఉన్నత చదువుల్లో లక్ష్యాలు సాధించగలుగుతారు.

ఈ ఏడాది 6, 7 స్థానాల్లో గురు సంచారం ఫలితంగా వ్యవసాయం, పరిశ్రమల రంగాల వారికి అనుకూలం. ఉద్యోగ, వృత్తి, వ్యాపారాల్లో కొన్ని ఆటంకాలు ఎదురైనా మొత్తం మీద పురోగతి కనిపిస్తుంది. ఆత్మవిశ్వాసం ధైర్య సాహసాలతో చేసే ప్రయత్నాలు జయప్రదం అవుతాయి. హోటల్, ఆహార ఉత్పత్తులు, ఔషధాలు, ఆస్పత్రులు, కేటరింగ్, నిత్యావసరాల రంగాల వారికి ప్రోత్సాహకరంగా ఉంటుంది. ఆదాయం పెరుగుతుంది. సెప్టెంబర్ ద్వితీయార్థం నుంచి ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. ప్రత్యర్థులపై విజయం సాధిస్తారు. ఉమ్మడి వ్యాపారం లాభిస్తుంది. కుటుంబ సమస్యలు పరిష్కారమవుతాయి. ఉగాది నుంచి జూన్ 10 వరకు ప్రత్యర్థుల నుంచి, వైవాహిక జీవితంలో చిక్కులు ఎదురవుతాయి. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. స్నేహ, బాంధవ్యాల విషయంలో జాగ్రత్తగా వ్యవహరించాలి.

ఈ ఏడాది 8, 9 స్థానాల్లో శని సంచారం జరుగుతుంది. ఫలితంగా ప్రమోషన్లు అందుకుంటారు. ఆస్తులు పెంపొందించుకుంటారు. ఇల్లు కొనుగోలు కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆరోగ్యం మెరుగుపడుతుంది. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రమోషన్లు అందుకుంటారు. సమాజంలో పేరు ప్రతిష్ఠలు సాధిస్తారు. శని వక్రగమనంలో ఉండే ఏప్రిల్ 7- ఆగస్టు 26 తేదీల మధ్య స్పెక్యులేషన్లలో నష్టం సంభవం. ఆరోగ్యం మందగిస్తుంది. క్రయవిక్రయాల్లో నిదానం అవసరం. కొత్త వ్యాపారాల ప్రారంభానికి తగిన సమయం కాదు. ఎవరినైనా నమ్మి డబ్బు ఇస్తే అది తిరిగి వచ్చే అవకాశాలు తక్కువ. పైచదువులకు ఆటంకాలు ఏర్పడే అవకాశం ఉంది.

5, 4 స్థానాల్లో రాహు సంచారం కారణంగా శ్రీ హేవళంబి సంవత్సరంలో ప్రేమలు బెడిసికొట్టే అవకాశం ఉంది. కుటుంబ వ్యవహారాలు మనస్తాపం కలిగిస్తాయి. విద్యార్థులకు చదువుల పట్ల శ్రద్ధ లోపిస్తుంది. అనవసర విషయాల్లో జోక్యం చేసుకుని మాటపడతారు. సంతతి విషయంలో ఆందోళనకు గురవుతారు. 11, 10 స్థానాల్లో కేతు సంచారం కారణంగా ఉద్యోగంలో ప్రోత్సాహకరం. వ్యాపారరంగంలోని వారికి ఆర్థికంగా అనుకూలం. అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. కాస్త ఫలితం కోసం శ్రమించాల్సి వస్తుంది. పైఅధికారులతో వ్యవహారాల్లో మౌనం మంచిది. **దత్తాత్రేయస్వామి ఆరాధనతో చిక్కులు తొలగుతాయి.**



**వృషభం (కృత్తిక 2,3,4; రోహిణి, మృగశిర 1,2 పాదాలు)**

వృషభ రాశి వారికి శ్రీ హేవళంబినామ సంవత్సరంలో అన్ని విషయాల్లో ఆనందప్రదంగా ఉంటుంది. ఆరోగ్యం మెరుగుపడుతుంది. పెట్టుబడులపై మంచి ప్రతిఫలం సాధిస్తారు. వృత్తి, వ్యాపారాల్లో పురోగతి కనిపిస్తుంది. వివాహ యత్నాలు ఫలిస్తాయి. ఇల్లు లేదా స్థలం కొనుగోలు చేస్తారు. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. విద్యార్థులు విజ యం సాధిస్తారు. ఏప్రిల్ - జూన్ మాసాల మధ్య ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. ఆస్తి వ్యవహారాల్లో చికాకులు ఎదురవుతాయి. 5-6 స్థానాల్లో గురుసంచారం కారణంగా ఈ ఏడాది సంతా నం విషయంలో శుభ పరిణామాలు సంభవం. స్నేహ సంబం ధాలు పెంపొందుతాయి. ఉన్నత విద్యాయత్నాలు ఫలిస్తాయి. వాయిదా పడుతున్న పనులు పూర్తి చేస్తారు. ఆర్థిక విషయాల్లో పట్టుదలతో వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. మీ సృజనాత్మకతకు తగిన అవకాశాలు లభిస్తాయి. శాస్త్ర, విజ్ఞాన రంగాల వారికి ప్రోత్సాహకరం. పిల్లల విద్య, వృత్తి, వివాహం విషయాలలో అభివృద్ధి కనిపిస్తుంది. సంవత్సరం ప్రారంభం నుంచి జూన్ వరకు గురువు వక్రగమనంలో ఉన్నందున పెద్దలతో పరిచయాలు ఏర్పడతాయి. ఆరోగ్యం, విద్య పట్ల అధిక శ్రద్ధ చూపాలి. సెప్టెంబర్ 13 నుంచి గురువు తులారాశిలో ప్రవేశిస్తాడు. ఫలితంగా ఉద్యోగ యత్నాలు ఫలి స్తాయి. వృత్తి, వ్యాపారాల్లో వికాసం కనిపిస్తుంది. ఆరోగ్యం మెరుగుపడుతుంది. ప్రమోషన్లు అందుకుంటారు.

ఈ సంవత్సరం శని 7, 8 స్థానాల్లో సంచరిస్తాడు. ఫలితంగా వివాహ ప్రయత్నాలు ఫలిస్తాయి. స్థిరాస్తులు కొనుగోలు చేస్తారు. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. అనవసర ఖర్చులు పెరుగుతాయి. శని వక్రించిన ఏప్రిల్-ఆగస్టు మాసాల మధ్య వైవాహిక జీవితంలో ఒడిదుడుకులు ఎదురయ్యే అవకాశం ఉంది. శతృబాధలు, రుణ బాధలు అధికం. ఆస్తి వ్యవహారాల్లో చికాకులు ఏర్పడతాయి. ఆర్థిక సంస్థలు, బీమా, మ్యూచ్యువల్ ఫండ్స్‌లో పనిచేసేవారు ఆశించిన ఫలితాలు రాక ఇబ్బందులు ఎదుర్కొంటారు. వాహనాలు నడిపేవారు జాగ్రత్త వహించాలి.

శ్రీ హేవళంబి సంవత్సరంలో 4, 3 స్థానాల్లో రాహుసంచారం కారణంగా కుటుంబ పరమైన సమస్యలు ఎదుర్కొంటారు. ఆటంకాలను అధిగమించి స్థిరాస్తి కొనుగోలు చేస్తారు. బదిలీలకు అవకాశం ఉంది. ఇంట్లో శుభకార్యం జరుగుతుంది. విద్యార్థులు లక్ష్యాలు సాధి స్తారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. 10, 9 స్థానాల్లో





కేతు సంచారం కారణంగా ఉద్యోగంలో చికాకులు, ఒత్తిడి తప్పకపోవచ్చు. ఖర్చులు అంచనాలు మిం చుతాయి. స్నేహానుబంధాల విషయంలో ఆచితూచి వ్యవహరించాలి. షేర్ల లావాదేవీల్లో నష్టం తప్పకపోవచ్చు. ఉన్నత చదువుల్లో పట్టుదలతో శ్రమించి ఫలితం సాధిస్తారు. **ఈశ్వరుడి ఆరాధన శుభప్రదం.**



**మిథునం (మృగశిర 3,4; ఆరుద్ర; పునర్వసు 1,2,3 పాదాలు)**

ఈ రాశి వారు హేవళంబినామ సంవత్సరంలో స్థల సేకరణ, గృహనిర్మాణం, రియల్ ఎస్టేట్ రంగాల్లో పురోగతి సాధిస్తారు. కుటుంబంలో పండుగ వాతావరణం నెలకొంటుంది. ఉద్యోగంలో పురోగతి సాధిస్తారు. ప్రేమానుబంధాలు బలపడతాయి. ఉన్నత విద్యాభ్యాసానికి అనుకూలం. వాహనం కొనుగోలు చేస్తారు. ఏప్రిల్ - జూన్ మాసాల మధ్య ఖర్చులు అధికంగా ఉంటాయి. ఆస్తుల క్రయవిక్రయాల్లో చిక్కులు ఎదురవుతాయి. కుటుంబసభ్యుల ఆరోగ్యం ఆందోళన కలిగిస్తుంది. ఈ ఏడాది 4, 5 స్థానాల్లో శుభప్రదుడైన గురువు సంచరిస్తాడు. ఫలితంగా విలువైన వస్తువులు, ఆభరణాలు, స్థిరచరాస్తులు సమకూర్చుకుంటారు, ఇంట్లో వేడుకలు, వివాహాది శుభకార్యాలు జరుగుతాయి. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. స్థల సేకరణ, గృహ నిర్మాణానికి అనుకూలం. గురువు వక్రగమనంలో ఉండే ఉగాది నుంచి జూన్ వరకు మధ్య రియల్ ఎస్టేట్, గృహనిర్మాణ రంగాల వారు ఆచితూచి వ్యవహరించాలి. ఆర్థిక విషయాల్లో ప్రతికూలత కనిపిస్తుంది. కుటుంబసభ్యుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. న్యాయపరమైన సమస్యలు తలెత్తే అవకాశం ఉంది. సెప్టెంబర్ నుంచి సంవత్సరాంతం వరకు గురువు పంచమంలో సంచారం చేయడం వల్ల విద్యార్థులకు శుభప్రదం. స్పెక్యులేషన్లు లాభిస్తాయి. విద్య, వైజ్ఞానిక రంగాల వారికి విశేష ప్రోత్సాహం లభిస్తుంది. శత్రువులు కూడా మిత్రులుగా మారతారు. స్నేహబాంధవ్యాలు విస్తరిస్తాయి. శని ఈ సంవత్సరమంతా 6, 7 స్థానాల్లో సంచారం చేస్తాడు. ఫలితంగా వృత్తి, వ్యాపారాల్లో పురోగతి సాధిస్తారు. శ్రమకు తగిన ప్రతిఫలం అందుకుంటారు. వివాహ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక విషయాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. వ్యాపార విస్తరణకు అవకాశం ఉంది. కొత్త ఆలోచనలు స్ఫురిస్తాయి. అదనపు బాధ్యతలు భుజానికి ఎత్తుకోవాల్సి వస్తుంది. పట్టుదలతో పనిచేసి లక్ష్యాలు సాధిస్తారు. శని వక్రించిన ఏప్రిల్ 7- ఆగస్టు 26 మధ్య ప్రత్యర్థుల నుంచి చిక్కులు ఎదురయ్యే అవకాశం ఉంది. వైవాహిక జీవితంలో మనస్పర్థలు తలెత్తే అవకాశం ఉంది. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. శ్రీ హేవళంబి నామ సంవత్సరంలో 3, 2 స్థానాల్లో రాహు సంచారం కారణంగా ఉద్యోగంలో మార్పులు, చేర్పులకు ఆస్కారం ఉంది. ఖర్చులు అంచనాలు మించుతాయి. బదిలీ కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. వయసులో చిన్నవారితో పరిచయాలు ఏర్పడతాయి. చెడుస్నేహాలకు దూరంగా ఉండాలి. భారీ పెట్టుబడులకు ఈ ఏడాది దూరంగా ఉండటం శ్రేయస్కరం. 9, 8 స్థానాల్లో కేతు సంచారం కారణంగా ఉన్నత చదువుల కోసం పట్టుదలతో ప్రయత్నించి సత్ఫలితాలు సాధిస్తారు. వ్యాపార రంగంలో అంచనాలు తలకిందులవుతాయి. ఆర్థిక వ్యవహారాల్లో చిక్కులు ఎదురవుతాయి. ఆస్తిపాస్తుల విషయాల్లో వివాదాలకు ఆస్కారం ఉంది. ఉద్యోగ, వ్యాపారాల్లో ఒత్తిడికి లోనవుతారు. **ఆంజనేయస్వామి ఆరాధనతో సత్ఫలితాలొస్తాయి.**



**కర్కాటకం (పునర్వసు 4; పుష్యమి, ఆశ్లేష)**

శ్రీ హేవళంబినామ సంవత్సరంలో ఈ రాశి వారికి కాంట్రాక్టులు, ఒప్పందాలు లాభిస్తాయి. ఉన్నత చదువుల కోసం విదేశాలకు వెళ్లేందుకు అనుకూలం. వృత్తిపరంగా స్థానచలనానికి అవకాశం. న్యాయ, రాజకీయ, ప్రచురణ, మార్కెటింగ్, రవాణా, కన్సల్టెన్సీ, ఏజెన్సీలు, విద్యారంగంలోని వారికి ప్రోత్సాహకరం. విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. సొంత ఇల్లు సమకూర్చు కుంటారు. ఉగాది నుంచి జూన్ వరకు విద్యార్థుల్లో అశ్రద్ధ పెరుగుతుంది. వాహనాలు నడిపేటప్పుడు జాగ్రత్త. విద్య, రాజకీయ రంగాల వారు అప్రమత్తంగా ఉండాలి.

ఈ ఏడాది గురుగ్రహం సెప్టెంబర్ 12 వరకు కన్యలో ఆ తరువాత తులారాశిలో సంచరిస్తుంది. ఫలితంగా సోదరీసోదరులు, బంధువుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. దూరప్రయాణాలకు అనుకూలం. ఉద్యోగ యత్నాలు ఫలిస్తాయి. బదిలీలకు అనుకూలం. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. గురువు వక్రించిన ఫిబ్రవరి 7 నుంచి జూన్ 19 వరకు వృత్తి, వ్యాపారాల్లో కొంత నిరుత్సాహకరంగా ఉంటుంది. ఉద్యోగ యత్నాలు ఫలించకపోవచ్చు. కుటుంబ విషయాల్లో చిక్కులు ఎదురవుతాయి.సెప్టెంబర్ తరువాత స్థిరాస్తులు సమకూర్చుకుంటారు. ఉద్యోగులకు ప్రశంసలు లభిస్తాయి. ఉమ్మడి వ్యాపారాలు ప్రారంభిస్తారు. వారసత్వ వ్యవహారాలు పరిష్కారం అవుతాయి.

ఈ ఏడాది 5, 6 స్థానాల్లో శని సంచారం కారణంగా ప్రేమ వ్యవహారాల్లో చికాకులు అధికం. విద్యార్థులు అశ్రద్ధ కారణంగా నష్టపోయే ప్రమాదం ఉంది. వ్యాపారంలో నష్టాలు చవిచూస్తారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. పని ఒత్తిడి అధికం అవుతుంది. ఉద్యోగులకు చిక్కులు ఎదురైనా కష్టపడి పనిచేసి గుర్తింపు తెచ్చుకుంటారు. భారీ వ్యాపారానికి, కొత్త ప్రాజెక్టులకు అనుకూల సమయం కాదు. రావలసిన డబ్బు సకాలంలో అందక ఇబ్బందిపడతారు. శని వక్రగమనంలో వున్న ఏప్రిల్ - ఆగస్టు మాసాల మధ్య వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరంగా వుంటుంది. ఆరోగ్యం మెరుగుపడుతుంది. వైద్యం, కేటరింగ్, రిటైల్, హోటల్ రంగాల వారికి శుభప్రదం. క్రీడాకారులకు అనుకూలం. వివాహ యత్నాలు నెమ్మదిగా నెరవేరతాయి.

శ్రీ హేవళంబి నామ సంవత్సరంలో 2, 1 స్థానాల్లో రాహు సంచారం ఫలితంగా అనవసర ఖర్చులు అధికం. మాట ఇచ్చి నిలబెట్టుకోలేకపోతారు. రుణబాధలు అధికం. మానసిక ఆందోళనలకు లోనవుతారు. ఆరోగ్యం మందగిస్తుంది. డబ్బు చేతిలో నిలవదు. 8, 7 స్థానాల్లో కేతు సంచారం కారణంగా వైవాహిక జీవితంలో ఒడిదుడుకులు ఎదుర్కొంటారు.ఆరోగ్యం మంద గిస్తుంది. మానసిక ఆందోళన అధికం. డ్రైవింగ్‌లో నిదానం పాటించాలి. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. **శ్రీవేంకటేశ్వర స్వామి ఆరాధన శుభాలనిస్తుంది.**



**సింహం (మఖ, పుబ్బ, ఉత్తర 1 పాదం)**

సింహ రాశి వారికి శ్రీ హేవళంబిలో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరంగా వుంటుంది. ఉద్యోగంలో బదిలీలు, ప్రమోషన్లకు అవకాశం ఉంది. ఆస్తి వ్యవహారాలు ఒక కొలిక్కి వస్తాయి. సంతానం విషయంలో పురోగతి కనిపిస్తుంది. పెట్టుబడులు లాభిస్తాయి. వ్యాపా





రంలో అభివృద్ధి కనిపిస్తుంది.ఆరోగ్యం మెరుగవుతుంది. ఏప్రిల్ -జూన్ మాసాల మధ్య తొందరపాటు నిర్ణయాల వల్ల ఆర్థికంగా నష్టపోయే అవకాశం ఉంది.

2-3 స్థానాల్లో గురుగ్రహ సంచారం కారణంగా ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరంగా వుంటుంది. స్థిర, చరాస్తులు, విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. ప్రముఖులతో సాన్నిహిత్యం ఏర్పడుతుంది. విద్యార్థులు పట్టుదలతో కృషి చేసి సత్ఫలితాలు సాధిస్తారు. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. అనుబంధాలు బలపడతాయి. వృత్తి వ్యాపారాలలో లాభాలకు, ఉద్యోగంలో పురోగతికి అవకాశం ఉంది. ప్రస్తుతం చేస్తున్న వ్యాపారంలో చిన్నపాటి మార్పులు చేయడం వల్ల లాభాలు ఆర్జిస్తారు. కుటుంబ వ్యవహారాలు ఆనందం కలిగిస్తాయి. వేగంగా నిర్ణయాలు తీసుకుంటారు. సంవత్సరం ప్రారంభం నుంచి జూన్ 10 వరకు గురువు వక్రించిన కారణంగా ఆర్థిక విషయాల్లో తొందరపాటు తగదు. సెప్టెంబర్ 13 నుంచి సోదరులు, సన్నిహితులతో సదవగాహన ఏర్పడుతుంది. చేపట్టిన పనులు పూర్తవుతాయి. విద్యాసంస్థలు, కన్సల్టెన్సీ, ఏజెన్సీల వారికి శుభప్రదం. ఉద్యోగం చేస్తూ చదువుకునేందుకు అనుకూలం.

4,5 స్థానాల్లో శని సంచారం కారణంగా ఆస్తి వ్యవహారాలు పరిష్కారం అవుతాయి. ప్రేమానుబంధాలు బలపడతాయి. ఉన్నత విద్య కోసం చేసే ప్రయత్నాలు నెమ్మదిగా ఫలిస్తాయి. విద్యార్థులు అశ్రద్ధ కారణంగా నష్టపోయే అవకాశం ఉంది. ప్రతి పనిలో ఆలస్యం, ఆటంకాలు ఎదురవుతాయి. శని వక్రించిన ఏప్రిల్ 7 - ఆగస్టు 26 తేదీల మధ్య ఉన్నత విద్యా విషయాలకు అనుకూలం. స్నేహబాంధవ్యాలు, ప్రేమ వ్యవహారాలు ఫలిస్తాయి. స్నేహాల వల్ల చదువుల పట్ల కొంత అశ్రద్ధ చూపే అవకాశం వుంది. ప్రేమ వ్యవహారాల్లో చిక్కులు, ఆటంకాలెదురైనా ఓరిమితో అందరినీ ఒప్పించేందుకు యత్నిస్తారు.

శ్రీ హేవళంబి నామ సంవత్సరంలో 1, 12 స్థానాల్లో రాహు సంచారం కారణంగా మనసు ఆందోళనగా ఉంటుంది. ప్రతి చిన్న విషయానికి కంగారు పడతారు. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలంగా ఉంటుంది. విలాస ఖర్చులు అధికం. విద్యలో కొన్ని ఆటంకాలు ఎదురైనా చివరకు సత్ఫలితాలు సాధిస్తారు.

7, 6 స్థానాల్లో కేతు సంచారం కారణంగా వైవాహిక జీవితంలో చిక్కులు ఎదురవుతాయి. కుటుంబ సభ్యుల్లో ఒకరి ఆరోగ్యం మందగించే అవకాశం ఉంది. అపార్థాలు, కోపావేశాల కారణంగా సంబంధాలు దెబ్బతింటాయి. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. **సూర్యభగవానుడి ఆరాధన శుభఫలితాలనిస్తుంది.**

### కన్య (ఉత్తర 2,3,4; హస్త; చిత్త 1,2 పాదాలు)



కన్యా రాశి వారు శ్రీ హేవళంబినామ సంవత్సరంలో అన్ని విషయాల్లో పురోగతి సాధిస్తారు. వ్యక్తిగత ప్రతిష్ఠ పెరుగుతుంది. వ్యాపారాన్ని విస్తరిస్తారు. సంకల్పం నెరవేరుతుంది. పెద్దల పరిచయాలు లాభిస్తాయి. గృహ నిర్మాణం, స్థలసేకరణకు అనుకూలం. వివాహ, ఉన్నత విద్యా యత్నాలు ఫలిస్తాయి. వైద్య, రాజకీయ సినీరంగాల వారికి ప్రోత్సాహకరం. ఏప్రిల్ -జూన్ మాసాల మధ్య అశాంతికి లోనవుతారు. చేపట్టిన పనులకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది.

ఏడాది ప్రారంభం నుంచి గురువు మీ చంద్రరాశిలో సంచరిస్తాడు. ఫలితంగా సృజనాత్మక ప్రతిభతో వినూత్నమైన ప్రాజెక్టులు చేపడతారు. ప్రమోషన్లకు అవకాశం ఉంది. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆరోగ్యం మెరుగుపడుతుంది. శ్రీవారు, శ్రీమతి సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. బాంధవ్యాలు బలపడతాయి. కొత్త భాగస్వామ్యాలు లాభిస్తాయి. శత్రువులు కూడా మిత్రులుగా మారతారు. సంతతి విషయంలో శుభపరిణామాలు సంభవం. విద్య, వైజ్ఞానిక, ఆధ్యాత్మిక, సాంస్కృతిక, రాజకీయ రంగాల వారికి పురోగతి కనిపిస్తుంది. కుటుంబం విస్తరిస్తుంది. వ్యాపారంలో లాభాలకు అవకాశం ఉంది. ఉన్నత విద్య, విదేశీ గమన యత్నాలు ఫలిస్తాయి. ఇంట్లో ఒక శుభకార్యం జరుగుతుంది. సంవత్సరం ప్రారంభం నుంచి ఫిబ్రవరి 7 నుంచి జూన్ 10 వరకు గురువు వక్రించిన కారణంగా అశాంతికి లోనవుతారు. అలర్జీలు బాధిస్తాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. సెప్టెంబర్ 13 నుంచి ఆర్థికంగా ప్రోత్సాహకరం. ఆస్తిపాస్తులు పెంపొందించుకుంటారు.

శని 3, 4 స్థానాల్లో సంచారం ఫలితంగా పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. బదిలీలు, సీట్ల మార్పిడి వల్ల అసౌకర్యానికి లోనవుతారు. దానివల్ల ఆందోళన పెరిగినా నెమ్మదిగా పరిస్థితులు సర్దుకుంటాయి. కుటుంబ విషయాల్లో చికాకులు అధికం. సంతానం విషయాలు ఆందోళన కలిగిస్తాయి. విద్యార్థులకు చదువుల పట్ల అశ్రద్ధ పెరుగుతుంది. విలాసాలకు వెచ్చిస్తారు. శని వక్రమగమనంలో ఉన్న ఏప్రిల్-ఆగస్టు మాసాల మధ్య ఆస్తి సమస్యలు పరిష్కారమవుతాయి. బదిలీ యత్నాలు ఫలిస్తాయి. కుటుంబంలో ఆహ్లాదకర వాతావరణం నెలకొంటుంది. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. ఇంట్లో, కార్యాలయంలో బాధ్యతలు అధికం.

శ్రీ హేవళంబి నామ సంవత్సరంలో 12, 11 స్థానాల్లో రాహుగ్రహ సంచారం కారణంగా అనవసర ఖర్చులు పెరుగుతాయి. మనసంతా చికాకుగా ఉంటుంది. క్రీడాకారులకు అనుకూలంగా ఉంటుంది. స్పెక్యులేషన్లు, ఆర్థిక లావాదేవీల్లో జాగ్రత్త వహించాలి. 6, 5 స్థానాల్లో కేతు సంచారం కారణంగా ప్రేమ వ్యవహారాల్లో చికాకులు. షేర్లు, భాగస్వామ్యాల్లో చిక్కులు ఎదురయ్యే అవకాశం ఉంది. ఉన్నత చదువుల కోసం చేసే యత్నాలకు ఆటంకాలు ఎదురవుతాయి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. **సుబ్రహ్మణ్యస్వామి ఆరాధన వల్ల లాభం కలుగుతుంది.**

### తుల (చిత్త 3,4; స్వాతి; విశాఖ 1,2,3 పాదాలు)

ఈ రాశి వారు హేవళంబినామ సంవత్సరంలో ప్రమోషన్లు అందుకుంటారు. గృహ నిర్మాణ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో భాగంగా విదేశీయానం చేస్తారు. వాహనాలు, స్థిరాస్తులు కొనుగోలు చేస్తారు. ఉన్నత



విద్యాభ్యాస ప్రయత్నాలు ఫలిస్తాయి. కొత్త పరిచయాలు ఏర్పడతాయి. రాజకీయ, సినీ, బోధన, న్యాయ, రక్షణ, ఫైనాన్సింగ్ రంగాల వారికి శుభప్రదం. ఉగాది నుంచి జూన్ వరకు ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. ప్రేమ వ్యవహారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. ఆర్థిక విషయాల్లో తొందరపాటు తగదు. విద్యార్థులు లక్ష్య సాధన కోసం అధికంగా శ్రమించాలి.

గురువు 12-1 స్థానాల్లో సంచారం చేస్తున్న ఫలితంగా విలాసాలకు, దూరప్రయాణాలకు





ఎక్కువ సమయం కేటాయిస్తారు. రాజకీయ నేతలు ఉన్నత పదవులు అందుకుంటారు. సినీరంగానికి చెందిన వారు మంచి ప్రాజెక్టులు చేపడతారు. స్నేహ బాంధవ్యాలు పెంపొందుతాయి. వివాహ ప్రయత్నాలు ఫలిస్తాయి. విశ్వాసంతో అనుకున్న పనులు నిరాటంకంగా పూర్తిచేయగలుగుతారు. సంతతి విషయంలో శుభపరిణామాలు సంభవం. ఏప్రిల్ 7 నుంచి ఆగస్టు 26 వరకు ఆర్థిక విషయాల్లో అనవసర ఖర్చులు అధికం. ఆదాయం పెరిగినా డబ్బు మాత్రం చేతిలో నిలవదు. ఇల్లు, ఉద్యోగంలో మార్పులు, చేర్పులకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థికవిషయాల్లో నిదానంగా కానీ పనులు జరగవు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. పుణ్యకార్యాలు, తీర్థయాత్రలకు ఖర్చు చేస్తారు.

2, 3 స్థానాల్లో శని సంచారం ఫలితంగా ఆర్థిక విషయాల్లో నిదానం పాటించండి. పెద్దల ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. సోదరీసోదరులు, సన్నిహితుల బాధ్యతలు మోయాల్సి రావచ్చు. వాహనాలు నడిపేటప్పుడు జాగ్రత్త. కుటుంబపరమైన గొడవలు తలెత్తుతాయి. చదువుల పట్ల శ్రద్ధ లోపిస్తుంది. వృత్తి, వ్యాపారాల్లో ఒత్తిళ్ల ఎదురైనా చివరకు సానుకూల ఫలితాలు సాధిస్తారు. శని వక్రగమనంలో ఉన్న ఏప్రిల్ 7 నుంచి ఆగస్టు 26 వరకు పట్టుదలతో కృషి చేసి చదువుల్లో రాణిస్తారు. వృత్తి, వ్యాపారాలకు సంబంధించి అనుకూల సమాచారం అందుకుంటారు. కుటుంబం, ఆస్తులు, ఆరోగ్య విషయాల్లో మెరుగైన వాతావరణం కనిపిస్తుంది. శ్రీ హేవళంబి నామ సంవత్సరంలో 11, 10 స్థానాల్లో రాహు సంచారం ఫలితంగా ఉద్యోగ ప్రయత్నాలకు ఆటంకాలు ఎదురవుతాయి. పట్టుదలతో ప్రయత్నించి చివరకు విజయం సాధిస్తారు. ఒత్తిళ్ల ఎదుర్కొంటారు. విలాసాలకు ఖర్చులు అధికం. ఆరోగ్యం మందగించే అవకాశం ఉంది. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. 5, 4 స్థానాల్లో కేతు సంచారం కారణంగా ప్రేమ వ్యవహారాల్లో చికాకులు తలెత్తే అవకాశం ఉంది. తొందరపాటుతనం వల్ల ఇబ్బందులు ఎదుర్కొంటారు. ఆస్తులు, ఆర్థిక విషయాల్లో ఇబ్బందులు పడతారు. ఆరోగ్యం మందగిస్తుంది. గృహనిర్మాణ కోసం చేసే ప్రయత్నాలు నెమ్మదిగా ఫలిస్తాయి. **శ్రీరామచంద్రుడి ఆరాధన శుభఫలితాలను ఇస్తుంది.**



**వృశ్చికం (విశాఖ 4, అనూరాధ, జ్యేష్ఠ)**

వృశ్చిక రాశి వారు శ్రీ హేవళంబినామ సంవత్సరంలో ఆర్థిక విషయాల్లో అభివృద్ధి సాధిస్తారు. వృత్తి, ఉద్యోగాల్లో పురోగతి కనిపిస్తుంది. జీవితం ఆనందదాయకంగా ఉంటుంది. కొత్త వ్యాపారాలు ప్రారంభిస్తారు. అందులో విజయం సాధిస్తారు. ప్రముఖులతో పరిచయాలు లాభిస్తాయి. ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. వినోద, విలాసాలకు సమయం వెచ్చిస్తారు. దంపతుల మధ్య సదవగాహన నెలకొంటుంది. ఏప్రిల్ - జూన్ మాసాల మధ్య ఆర్థిక వ్యవహారాల్లో నిరుత్సాహంగా ఉంటుంది. మనశ్శాంతి లోపిస్తుంది. విద్యార్థులకు చదువు పట్ల శ్రద్ధ లోపిస్తుంది.



గురువు ఈ ఏడాది లాభ, వ్యయ స్థానాల్లో సంచరిస్తున్నాడు. ఫలితంగా ఆదాయం పెరుగుతుంది. వృత్తి, వ్యాపారాల్లో పురోగతి సాధిస్తారు. పిల్లల విషయంలో అభివృద్ధికి, శుభకార్యాలకు అవకాశం ఉంది. వివాహయత్నాలు ఫలిస్తాయి. విద్య, వైజ్ఞానిక, ప్రచురణలు, ప్రకటనలు, బోధన, న్యాయ, సినీ, రాజకీయ రంగాలలో ఉన్నవారికి ప్రోత్సాహం లభిస్తుంది. విదేశీ గమనానికి, విదేశాలలో చదువులకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. టెక్స్‌టైల్స్, చలనచిత్రాలు, మత్స్య, రవాణా, టైల్స్, ఫొటోగ్రఫీ రంగాల వారికి ప్రోత్సాహకరం. ఉద్యోగంలో స్థిరత్వం సాధిస్తారు. ఉగాది నుంచి జూన్ వరకు పెద్దల ఆరోగ్యం మందగిస్తుంది.ఖర్చులు పెరుగుతాయి.

1, 2 స్థానాల్లో శని సంచారం వల్ల ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. అన్ని పనుల్లో ఆటంకాలు ఎదురవుతాయి. మనసు చంచలంగా ఉంటుంది. ఏ విషయంలోనూ ఒక నిర్ణయానికి రాలేకపోతారు. విద్యార్థులు అశ్రద్ధ కారణంగా నష్టపోతారు. స్నేహ, బాంధవ్యాల పట్ల అశ్రద్ధ చూపే అవకాశం ఉంది. ఆర్థిక విషయాల్లో వివాదాలు తలెత్తే అవకాశం ఉంది. మంచికి పోతే చెడు ఎదురవుతుంది. రుణబాధలు అధికం. పెట్టుబడుల్లో తొందరపాటు తగదు. దీర్ఘకాలిక దృష్టితో చేసే పెట్టుబడులు కొంతవరకు లాభిస్తాయి. వేరేవారి ఆర్థిక విషయాల్లో తలదూర్చి చిక్కుల్లో పడతారు. ఏప్రిల్ 7 నుంచి ఆగస్టు 26 వరకు ఆలస్యాలను, వైఫల్యాలను లెక్కచేయకుండా ప్రయత్నాలు కొనసాగించి లక్ష్యాలు సాధిస్తారు. స్థిరచరాస్తులు సమకూర్చుకుంటారు. శ్రీ హేవళంబి నామ సంవత్సరంలో 10, 9 స్థానాల్లో రాహు సంచారం కారణంగా ఉద్యోగ, వ్యాపారాల్లో చికాకులు అధికం. బదిలీలు, మార్పులు అసౌకర్యం కలిగిస్తాయి. ఉద్యోగం మారేందుకు ప్రయత్నిస్తారు. తొందరపాటు నిర్ణయాలకు ఇది సమయం కాదని గ్రహించాలి. అనుభవం ఉన్న వారి సహకారంతో ఒక నిర్ణయానికి వస్తారు. 4, 3 స్థానాల్లో కేతు సంచారం కారణంగా కుటుంబ వ్యవహారాలు కొంత అశాంతి కలిగిస్తాయి. ఆరోగ్యం మందగిస్తుంది. వాహనాలు నడిపేటప్పుడు జాగ్రత్త. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. అనవసర ఖర్చులు పెరుగుతాయి. సోదరీసోదరులు, బంధుమిత్రులతో సఖ్యత లోపిస్తుంది. **లక్ష్మీదేవి ఆరాధన వల్ల శుభఫలితాలు కలుగుతాయి.**



**ధనుస్సు (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పాదం)**

ఈ రాశిలో పుట్టినవారు హేవళంబిలో వృత్తి, ఉద్యోగ, వ్యాపారాల్లో అభివృద్ధి సాధిస్తారు. ప్రమోషన్లు, ఉన్నత పదవులకు అవకాశం ఉంది. ఆర్థిక విషయాల్లో పురోగతి సాధిస్తారు. రాజకీయ, ప్రభుత్వ, సహకారరంగాలకు చెందిన వారికి ప్రోత్సాహకరంగా ఉంటుంది. ఇంట్లో శుభకార్యాలు జరుగుతాయి. వైవాహిక జీవితం ఉల్లాసంగా ఉంటుంది. గృహనిర్మాణ ప్రయత్నాలు ఫలిస్తాయి. విద్యార్థులకు ప్రోత్సాహకరం. ఏప్రిల్ - జూన్ మాసాల మధ్య పెద్దల ఆరోగ్యం కలవరపెడుతుంది. బాధ్యతలు అధికం అవుతాయి.

గురువు ఈ ఏడాది 10, 11 స్థానాల్లో సంచరిస్తాడు. ఫలితంగా వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలలో పురోగతి కనిపిస్తుంది. అదనపు ఆదాయం కోసం చేసే యత్నాలు ఫలిస్తాయి. వ్యాపార రంగంలోని వారికి ఊహించని విధంగా లాభాలు వస్తాయి. అధికారం, హోదా, గౌరవ ప్రతిష్ఠలు పెరుగుతాయి. తల్లిదండ్రుల విషయంలో శుభపరిణామాలు కనిపిస్తాయి. రాజకీయ రంగంలోని వారికి ఉన్నత పదవులు లభిస్తాయి. ఉగాది నుంచి జూన్ 10 వరకు బదిలీలు, మార్పులు చేర్పులు అసౌకర్యం కలిగిస్తాయి. వృత్తి వ్యాపారాల్లో చికాకులు అధికం. తొందర పాటు నిర్ణయాలు తగవు. సెప్టెంబర్ 13 నుంచి లాభస్థానంలో గురు సంచారం వల్ల ఆర్థిక పరిస్థితి





మెరుగుపడుతుంది. పిల్లల విషయంలో అభివృద్ధికి, శుభకార్యాలకు అవకాశం ఉంది. వివాహ యత్నాలు ఫలిస్తాయి.

12, 1 స్థానాల్లో శని సంచారం ఫలితంగా ప్రేమలు ఫలిస్తాయి. బంధుమిత్రుల పరిధి విస్తరిస్తుంది. పెద్దల సహకారం, సలహాలు తీసుకుని ముందడుగు వేయాలి. ఆరోగ్యం మందగిస్తుంది. శిరోవేదన, నరాలు, కండరాలకు సంబంధించిన సమస్యలు ఎదుర్కొంటారు. కుటుంబ సభ్యులతో ఎడబాటు తప్పకపోవచ్చు. పోలీసు, రక్షణ రంగాల వారికి చిక్కులు ఎదురవుతాయి. ఏప్రిల్ 7 నుంచి ఆగస్టు 26 వరకు శని వక్రించి ఉన్న కారణంగా క్రమశిక్షణతో వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ప్రముఖులతో పరిచయాలు ఏర్పడతాయి. పట్టుదలతో చేపట్టిన పనులు పూర్తిచేస్తారు. రియల్ ఎస్టేట్ వ్యాపారులు ఓరిమితో మంచి ఫలితాలు సాధిస్తారు.

శ్రీ హేవళంబి నామ సంవత్సరంలో 9, 8 స్థానాల్లో రాహు సంచారం కారణంగా ఆరోగ్యం పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపాలి. ఆర్థిక విషయాల్లో తొందరపాటు నిర్ణయాలు తగవు. డబ్బు విషయంలో మోసపోయే అవకాశం ఉంది. క్రయవిక్రయాలకు ఏ మాత్రం అనుకూల సమయం కాదు. కీలక నిర్ణయాలను వాయిదా వేయడం మంచిది. 3, 2 స్థానాల్లో కేతు సంచారం కారణంగా ఉద్యోగ, వ్యాపారాల్లో మార్పులు, చేర్పులు ఇబ్బంది కలిగిస్తాయి. అనవసర ఖర్చులు అధికం. సంతానం విషయంలో సమస్యలు ఎదురవుతాయి. విద్యార్థులు పరధ్యానం కారణంగా నష్టపోతారు. మనసు చికాకుగా ఉంటుంది. **గణపతి ఆరాధన వల్ల సత్ఫలితాలు సాధిస్తారు.**



### మకరం (ఉత్తరాషాఢ 2,3,4; శ్రవణం; ధనిష్ఠ 1,2 పాదాలు)

మకర రాశి వారు శ్రీ హేవళంబినామ సంవత్సరంలో ఆర్థికంగా అభివృద్ధి సాధిస్తారు. విదేశీగమన ప్రయత్నాలు ఫలిస్తాయి. వృత్తిలో పురోగతి కనిపిస్తుంది. వ్యాపారాన్ని అభివృద్ధి చేస్తారు. సేవాకార్యక్రమాల్లో పాల్గొంటారు. ఉన్నత పదవులు అందుకుంటారు. కొత్త వ్యాపారానికి, పరిశ్రమల ప్రారంభానికి తగిన సమయం. గురువు వక్రగమనంలో ఉండే ఏప్రిల్ - జూన్ మాసాల మధ్య ఆందోళనలు అధికం అవుతాయి. వృత్తిపరమైన ఒత్తిడులకు లోనవుతారు. న్యాయ, ఆరోగ్యపరమైన సమస్యలు తలెత్తుతాయి.

9, 10 స్థానాల్లో గురు సంచారం వల్ల ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అనుకూలం. వృత్తి, వ్యాపారాల్లో శుభపరిణామాలు సంభవం. ప్రమోషన్లు సాధిస్తారు. వ్యాపార విస్తరణకు తగిన సమయం. న్యాయ, ఆధ్యాత్మిక, బోధన, పత్రికలు, రాజకీయ రంగాలలో ఉన్నవారికి ప్రోత్సాహకరం. సంతాన ప్రాప్తికి అనుకూలం. కళ, సాంస్కృతిక, బోధన, ఉన్నత విద్య, విదేశీ వ్యవహార రంగాల వారికి ప్రోత్సాహకరం. వృత్తి, వ్యాపారాల్లో పురోగతి కనిపిస్తుంది. రాజకీయ రంగంలోని వారికి ఉన్నత పదవులు లభిస్తాయి. వాహనాలు కొనుగోలు చేస్తారు. ఉద్యోగంలో మార్పు కోరుకుంటారు. విద్యార్థులు, క్రీడారంగంలోని వారికి శుభప్రదం. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. ఉగాది నుంచి జూన్ 11 వరకు గురువు వక్రించిన కారణంగా వృత్తి వ్యాపారాల్లో శ్రమాధిక్యం. బదిలీలు అసౌకర్యం కలిగిస్తాయి. మీ పురోగతి చూసి అసూయపడేవారు పెరుగుతారు. పెట్టుబడుల్లో జాగ్రత్త వహించాలి.

11, 12 స్థానాల్లో శని సంచారం కారణంగా వ్యాపారంలో లాభాలు ఆశించిన స్థాయిలో ఉండకపోవచ్చు. విలాసాలకు ఖర్చులు అధికం. రుణబాధలు ఎక్కువగా ఉంటాయి. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలు, కళలు, సినిమాలు, వినోదం, పర్యాట రంగాల వారు ఆశించిన ఫలితాలు అందక నిరుత్సాహపడతారు. రహస్య కార్యకలాపాల కారణంగా అప్రతిష్ఠకు గురవుతారు. కుటుంబ బాధ్యతలు, వృత్తిపరమైన పనులతో ఒత్తిడికి లోనవుతారు. ఏప్రిల్ 7 నుంచి ఆగస్టు 26 వరకు భాగస్వామి సహకారం లభిస్తుంది. క్రమశిక్షణతో, ఓరిమితో చేపట్టిన పనులు పూర్తి చేస్తారు.

శ్రీ హేవళంబి నామ సంవత్సరంలో 8, 7 స్థానాల్లో రాహు సంచారం కారణంగా పెట్టుబడుల్లో తొందరపాటు తగదు. ఆర్థిక విషయాల్లో ఇతరులకు సాయం చేసే విషయంలో ఒకటి రెండు సార్లు ఆలోచించాలి. వివాహ సంబంధాల్లో ఒడిదుడుకులు ఎదురవుతాయి. ప్రేమానుబంధాలు బెడిసికొట్టే అవకాశం ఉంది. విద్యార్థులు పట్టుదలతో కృషి చేసి సత్ఫలితాలు సాధిస్తారు.

2, 1 స్థానాల్లో కేతు సంచారం కారణంగా అనవసర ఖర్చులు అధికం. చికాకులు కారణంగా ఏ విషయం మీదా దృష్టి కేంద్రీకరించలేకపోతారు. **దుర్గామాత ఆరాధన శుభప్రదం.**



### కుంభం (ధనిష్ఠ 3,4; శతభిషం; పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

కుంభ రాశి వారు హేవళంబినామ సంవత్సరంలో ఆర్థికంగా పురోభివృద్ధి సాధిస్తారు. వృత్తి, వ్యాపారాల్లో సత్ఫలితాలు అందుకుంటారు. పైచదువులు, విదేశీ గమనానికి అనుకూలం. కొత్త వ్యాపారాలకు తగిన సమయం. విద్యార్థులు, క్రీడారంగంలోని వారికి శుభప్రదం. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. స్థలమార్పిడికి, ప్రమోషన్లకు అవకాశం ఉంది. రాజకీయ, కళ, సినీ, రవాణా, విద్య, ఐ.టి. రంగాల వారికి ప్రోత్సాహకరం. ఏప్రిల్ - జూన్ మాసాల మధ్య ఆర్థిక విషయాల కారణంగా ఆందోళన అధికం అవుతుంది. వృత్తిపరమైన ఒత్తిడులకు లోనవుతారు. న్యాయ, ఆరోగ్యపరమైన సమస్యలు తలెత్తుతాయి.

8-9 స్థానాల్లో గురు సంచారం ఫలితంగా ఈ ఏడాది స్థిరచరాస్తులు సమకూర్చుకోగలుగుతారు. వృత్తి ఉద్యోగాలలో శుభ పరిణామాలు సంభవం. న్యాయ, ఆధ్యాత్మిక, బోధన, పత్రికలు, రాజకీయ రంగాల వారికి ప్రోత్సాహకరం. ఉద్యోగులు ఆర్థికంగా అభివృద్ధి సాధిస్తారు. ఉన్నత చదువుల కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆరోగ్యం మెరుగుపడుతుంది. వైద్యరంగంలోని వారికి చక్కటి పురోగతి కనిపిస్తుంది. శత్రువులతో విభేదాలు సమసిపోతాయి. ఉగాది నుంచి జూన్ 10 వరకు ఆస్తి వ్యవహారాల్లో చికాకులు ఎదురవుతాయి. కొత్త పెట్టుబ

